Presented to K.R.R.I.
K. Sreeramulu Pantulu garu

# కావ్య నాటకాదిపరిశీలనము.

by the Author's nephew and Son-in-law
K. Subbarao
Ramalingeswara...
Tenali
24-7-193



అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రి.

వెల రు 1—0—0.

# కావ్యనాటకాదిపరిశీలనము.

వ్యాసరచనాభ్యాసమున నుపయోగించుపుస్తకము.

ఇందలి

## విషయానుక్రమణిక.

---

## ౩—మృచ్ఛకటికనామౌచితి.

మట్టిబండి కథనెల్ల సూచించుచు రసపరిసారాస్పదమగుచున్నదనుట.

## ౪—నైషధములు.

కొన్నిచోట్ల శ్రీహర్షుఁడు మించుట కొన్నిచోట్ల శ్రీనాథుఁడు మించుట.

## ౫—లక్షణనిర్బంధము

దశరూపకములోని నియమబాహుళ్యము. అలంకారదృష్టి. అనునివి విమర్శింపఁబడినవి

## ౬—చింతామణిసూచన.

గ్రామ్య గ్రాంథిక భాషల విచారణచేయబడినది.

## ౭—వ్యాకరణబాహుళ్యము.

భాషాప్రవేశసాధనమగు వ్యాకరణము సంస్కృతములోవలె విరివిగాక ఇంగిలీషులోవలె మితముగ నుండవలెననుట.

## ౮—ద్రౌపదిరోషము.

ఉద్యోగపర్వమున వ్యాసుఁడు ప్రకటనగఁజూపిన యీభావమును రాజశాంతోచితమగునట్లు నిగూఢముగా సూక్తివైదగ్ధ్యముతోఁ దిక్కన ధ్వనింపజేయుట.

## ౯—భారతకవియౌచితి.

సంజయరాయభారములో శ్రీకృష్ణధర్మసంజయుల నైపుణ్యమును సముచితముగఁ జూపుట.

## ౧౦—బమ్మెరపోతరాజుకవిదృష్టి.

రజోగుణప్రధానుఁడగు హిరణ్యకశిపుని భావములచొప్పెత్తినట్లు వ్రాయుట.

వలయువారు

అవ్వారిసుబ్రహ్మణ్యశాస్త్రి,-కొవ్వూరు, పశ్చిమగోదావరిజిల్లా.

# ఉత్తర రామ చరిత్ర.



భవభూతి రచితమైన యుత్తరరామచరిత నాటకమునకుఁ బ్రకృతి వాల్మీకి రచితమైన శ్రీమద్రామాయణోత్తరకాండమందలి కథయై యున్నది ఆకథాంశములను గొన్నిటిని సూచించియుఁ గొన్నిటిని విడనాడియుఁ గొన్నిటిని లాతిపర్యవసానముల కుపయోగించుకొనియుఁ గొన్నిటిని మార్చియుఁ గొన్ని క్రొత్తలు కల్పియు భవభూతిమహాకవి నాటకమును వ్రాసియుండెను.

పట్టాభిషేకానంతరమున శ్రీరాముని వందిజనులు నుతించుటను వాల్మీకి వాకొనెను. ఆవిషయమును భవభూతి మహాకవి ప్రస్తావనలో నటునిచేత "తేనహి నిరూపయతు రాజ్ఞస్సుపరిశుద్ధా ముపస్థానపద్ధతిం భావః" అని సూచన సేయించి దానిచే సీతాపవాద మెల్లరయెడల వ్యాపించియున్న దను నంశమును వాల్మీకిప్రోక్తమును బ్రసంగ సంగతిఁ జెప్పించుచున్నాఁడు. "సర్వథా ఋషయో దేవతాశ్చ శ్రేయో విధాస్యంతి" అని వాక్యార్థసూచన చేయుచున్నాఁడు. మఱియు "యేనామ కేచి దిహ నః ప్రథయ న్త్యవజ్ఞాం జానంతి తే కిమపి తాన్ప్రతి నైష యత్నః" అని యితర స్థలమునఁ జెప్పఁబడిన కవియాథార్థ్యము గూడ నీప్రసంగము

వసే "వాచాం సాధుత్వే దుర్జనో జనః" అని లోకుల పామరత్వముమీఁద విసుగుకొనుటచే వ్యక్తపఱుపఁబడె. పట్టాభిషేకమునకు వచ్చిన జనకుఁడుమున్నగు రాజులు మొదలైన వారందఱును వెళ్ళిరనియు, వానరులును రాక్షసులును రెండు మాసములుండిపోయిరనియు వాల్మీకి వ్రాసెను. అదియుంత యుఁ బ్రస్తావనలో సూత్రధారుఁడు "కిమిదానీం విశ్రాంత చారచరణాని చత్వరస్థానాని" అని యడిగినప్పుడు నటునిచేఁ జెప్పించెను.

ఈప్రసంగములోఁ గలిపి ఋశ్యశృంగుని యజ్ఞమునకు వసిష్ఠుఁడును అరుంధతియుఁ గౌసల్యాకైకయీసుమిత్రలును బోయిరని తనచేఁ గల్పింపఁబడిన యంశమును జెప్పెను. ఈకల్పన సీతను గర్భభారాలసను గాఁ జేసిన సందర్భముతోను బాఘుట యందలి యసంభవమును దీసివేయుచున్నది. తల్లులును వసిష్ఠుడు నరుంధతియు వయోధ్యలో నుండి రేని వారు నిరోధింపరా? కావున నిది యసంభవము. అనిపించుచున్నది. అట్లనిపింపకుండుట కీకల్పన పనికివచ్చుచున్నది ఇదిగాక "యుక్తః ప్రజానామనురంజనే స్యాః" అను వసిష్ఠునిసందేశమున కాయన దూరస్థుఁడై యుండినప్పుడే పామరజనాపవాదము గూడ సహింపఁగూడదనునర్థముఁ జేసికొనుటకు శ్రీరాముల వారి కవకాశము కలిగినది లేక వసిష్ఠులవారే సమీపమున నున్న "సతాం కేనాపి కార్యేణ లోకస్యారాధనం మతమ్" అనుసిద్ధాంతము నెట్లు సమన్వయించి శ్రీరామచంద్రునకుఁ

గలిపియుండునో! ఇట్టియాశంక లెవ్వియు సద్దుకొనకుండ భవ
భూతిమహాకవి శ్రీరామాజ్ఞానువర్తులైన రామలక్ష్మణభరత
శత్రుఘ్నాదులనుమాత్రమే యయోధ్యలో నిలిపి వసిష్ఠాలగు
పెద్దలను దూరమునకుఁ దలుపుచున్నాఁడు. జనకుఁడు వెళ్లు
టను వాల్మీకి కథారూపమునఁ జెప్పి యూరకుండెను. భవ
భూతి దానిని సీతారామపాత్రౌచిత్యపోషణద్వారమున రస
పోషణ కుపయోగించుకొనుచున్నాఁడు. తండ్రివియోగమున
జానకికి వైమనస్యము కలిగినది ఆమె వైమనస్యమును బో
గొట్టుటకు శ్రీరామచంద్రుఁడు ధర్మాసనమును విడిచిపెట్టి
వాసగృహమున కేఁగె. సీత గురుబంధువియోగములు సం
తాపకరములనుచున్నది. దీనిచే నాయికకుండవలసినశాలీనత
సీతయందుఁ జూపఁబడినది శృంగార నాయకులలోని యను
కూలునిరీతి శ్రీరామునియందుఁ బ్రదర్శింఁబడినది. ఈవియో
గమునే సంతాపకరముగ భావించి విమనస్కురాలగు సీత శ్రీ
రామచంద్రవియోగమున కెంతగా సంతాపమందియుండునో
అని వర్ణింపఁబడఁబోవు సీతాశోకమున కీకల్పన పరిపుష్టి
నొసఁగెడిని. అట్లే ఈపాటి సీతావైమనస్యమున కోర్వఁ
జాలని శ్రీరామచంద్రుఁ డడవిలో సీత నొంటిగ డింపిచి
యెంతగా శోకవ్యాకులుఁ డయ్యెనో! అని శ్రీరామునియం
దుఁ బ్రదర్శింపఁ బడఁబోవు శోకసమృద్ధికి సైతమీకల్పన
చేయూఁతనొసఁగుచు రసపోషక మనఁబడుచున్నది.

# కావ్యనాటకాదిపరిశీలనము.

అష్టావక్రుని రాక శ్రీమద్రామాయణమునఁ గన్పట్ట లేదు. భవభూతి కల్పించినాఁడు. ఈకల్పనలో భావమేమన యజ్ఞమునకుఁబోక సీతావినోదమునకై శ్రీరాముఁ డింట నుండెననుటచే సీతయందు శ్రీరామునికిఁ గలప్రేమ వ్యక్తమగుచున్నది. ‹‹ధర్మానసనా ద్వీశతి వాసగృహం›› అనుటచే రాజధర్మభర్తృధర్మములకు సమప్రాధాన్య మిచ్చి యీకల్పనచే బంధుప్రేమకన్న సీతాప్రేమ కాధిక్యమునొసఁగుచు శ్రీరాము నిచ్చట ననుకూలనాయకునిగఁ బ్రదర్శించుట కవిపని యైనది. మఱియు నీయష్టావక్రాగమనకల్పనలో గర్భిణియగు సీత కోరికదీర్చుటయందలి యావశ్యకత తల్లులయొక్కయు శాంతయొక్కయు నరుంధతియొక్కయు సందేశమువలనఁ గలుగుచున్నది. దీనివలన సీత నిద్రలేచునప్పటికి లక్ష్మణుఁడు రథములో సన్నద్ధుఁడై యుండినప్పుడు తనతో వచ్చెదనన్న శ్రీరాముఁడు రాలేదేలొకోయని సీత కనుమానము కలుగలేదు. తన కోర్కెఁ దొందఱగాఁ దీర్పవలసినదగుటచే శ్రీరాముఁడితరకార్యవ్యగ్రతచే రాలేదని తలఁచి శ్రీరాముఁడు లేకుండఁ దాను వెళ్లుటకు సమ్మతించెనేమో సీత. అభిజ్ఞానశాకుంతలము పఞ్చమాంకములో వసుమతీదేవి నిట్లే "కార్యజ్ఞాశాద్యోపరాధం మే పరిహరతి'' అనిభర్తృకార్యానుకూల్యము గలదానినిగ మహాకవి కాళిదాసుఁడు చూపినాఁడు. ఇదియు నుంగాక యీయష్టావక్రిపరిసంగములోని వసిష్ఠసందేశమొకటి ముఖ్యముగ లోకాపవాదభీతుఁడగాఁబోవు రామచం

డ్రుని విచారసాగరములో నొకప్రవాహమునకు నెట్టుటకుఁ జాలుచున్నది. శ్రీరాములవారికి సీత నడవులకుఁ బంపుటచేఁ గల్గు మహా కఠినత్వమును గురుభక్తిరసముచేత లోపింపఁ జేయుచున్నది. భద్రుఁడు సీతాపవాదమును శ్రీరాములతోఁ జెప్పెడిదినముననే ప్రాతఃకాలమున నంతఃపురమందు శ్రీరాముఁడు గర్భిణియగు సీతను "నీకేమికోరిక గలదని చెప్పుము" అనెను. "గంగాతీరతపోవనముల సంచరింపఁ గోరిక గలదు. ఒకరాత్రియైనఁ దపోవనమున నివసింపవలెను.,, అని సీత కోరుకొనెను. ఇది యిట్లు చూపుట భవభూతికిష్టము కాలేదు. సీత తపోవనసంచారకాంక్షకుఁ గారణమును బ్రదర్శింప నమకట్టి చిత్రదర్శనమును దననాటకములో సమకూర్చెను. చిత్రములోఁ బూర్వము చూడఁబడిన యడవులు కొండలునదులు బయళ్లు మొదలైనవి చిత్రింపఁబడియున్నవి. వాని నన్నింటిని వివరముగాఁ జూచుటంజేసి యప్పటిసందర్భము లన్నియు స్మృతికి వచ్చినపిమ్మట నెంతెంతలేసి కష్టములైనను స్మరింపఁబడు నప్పుడు వినోదముగనే యుండును కాన వనసంచారకౌతూహలము జానకికిఁ గలిగినదని చెప్పవలెనని నాటకకవి యుద్దేశము. ఇదిగాక యీనాటకమున సంభోగశృంగారము మొట్టమొదట సమృద్ధిగ వర్ణింపఁబడుచుండుటచేతను, చిట్టచివరఁ గూడ నదియే ప్రదర్శింపఁబడుఁ గావునను, ద్వితీయాద్యంకములం దెల్లయెడలఁ గరుణావిప్రలంభము వర్ణింపఁబడుఁ గావునను బ్రవాసవిప్రలంభమును స్మరణరూపమునఁ గొంత చూపించి

సీతారాముల పరస్పరవియోగాసహిష్ణుత నత్యంతసంతాప
పారవశ్యములతోఁ గనిపింపఁజేయవలయు నను కవియూహయు
నీచిత్రదర్శనముచేత నెఱవేఱినది. ఇంక నయ్యెసందర్భము
లలో జిత్రదర్శనమున సీతారాముల యుత్తమగుణములెల్లఁ
బూసగ్రుచ్చినట్లు చూపఁబడినవి.

---

# సీతారాములు—వాల్మీకిభవభూతులు.



శ్రీరాములవారి పత్నియుఁ బరమపతివ్రతయు నగు
జానకినిగూర్చి పట్టణములలోనను బల్లెలలోనను బెద్దయప
వాద మొకటి కల్గినది. రావణాసురుఁడు కొంతకాలము లంక
లో నుంచికొనిన పుడమిపట్టి నేలుకొనుట గొప్పతప్పని శ్రీరా
ముని చరిత్రమును బౌరజానపదులెల్లరు నెక్కడఁ జూచినను
నిందింపసాగిరి. అది భద్రుఁడనుచారునివలన శ్రీరాముల
వారికిఁ దెలిసినది. అది యసత్యమగునో యని పలువురను
శ్రీరాములవారు విచారించిరి. నిజమని తేలినది. తన ప్రవ
ర్తనమును దుష్టముగా సమర్థించెడి ప్రజలు రాజైన తన్నుఁ
బ్రమాణముగాఁ గొని యధర్మప్రవర్తను లగుదురని శ్రీరా
ముఁడు భావించెను. ఈయెడఁ దాను జేయవలసిన కృత్యము

నుగూర్చి స్వయముగ శక్తికొలఁది నాలోచించుకొనెను. అప్పుడు, సీత గర్భిణియై యుండి యాశ్రమవాసమును దౌహృదముగాఁ గోరియున్న సంగతి యయ్యనఘుని జ్ఞప్తికిఁ దట్టెను.

సీతామహాదేవికి ఋషివాటికలకన్న సౌధములు లిష్టములుకావు జానకికి ఋషికన్యకలకన్న నంతఃపురతరుణు లింపునింపరు. శ్రీరామపత్నికి గోమయలిప్త వేదికలవలె గచ్చుటరుగులు సొంపుగ నుండవు నదీప్రవాహములు జూచుకొనుచుఁ బచ్చికబయళ్లలోఁ దిరుగుచు జింకపదువుల నదలించుచుఁ గానన విహంగకూజితము లాలకించుచుఁ గాలక్షేపము సేయుట సీతకు జీవితఫలముగాఁ దోఁచుచుండును ఋషుల ధర్మపురాణము లామెకుఁ గర్ణరసాయనములు కావుననే గర్భవతియైయుండి యామె ఋష్యాశ్రమనివాసమును గోరికొనినది. ఇట్టి సీత ప్రకృతిని జిరకాలసన్నిహితపరిచితుఁడగు శ్రీరామచంద్రుఁ డెఱుంగును. ఇతరులగు మనమందఱము మనభావములతోఁ బోల్చుకొని పెఱరాచకన్నియలకంబలె నామెకును రాజభోగములందును రాజ్యాధికారములందును రక్తి గలిగియుండునని తలంచెదము. కావుననే సీత నడవులకంపుటచే శ్రీరాముఁ డతికఠోరహృదయుఁడుగ మనకుఁ గన్పట్టుచుండును. కాని శుద్ధసత్త్వవిలసితమై సుఖైకానుభవరసికమైయుండు జానకి దివ్యప్రకృతిని శ్రీరామచంద్రునివలె లాఁతివారెవ రెఱుంగఁగలరు?

అప్పుడు శ్రీరాములవారు రాయమును ఋషాశ్రమము లలో విడిచిపెట్టి పౌరజానపదులకు ధర్మవిశ్వాసమును బ్రబలఁ జేయుచు రాజధర్మమైన ప్రజారంజకత్వమును నిల్పుకోఁ దలఁచెను. సీతప్రకృతినిబట్టి సీత కది యెక్కువ క్లేశకరము కాదనియు నెంచియుండును. ధర్మసూక్ష్మము లెఱిఁగి చాల కాల మరణ్యవాస సహచరియునైయున్న జానకి తన ధర్మ నిర్వహణమునెడ ననుమోదమునే చూపునని యుం డును. లక్ష్మణుఁ డడవిలో దింపి రామాజ్ఞను జెప్పినపుడు సీత శ్రీరామునితోఁ జెప్పుమని "పౌరాపవాదమువలన శ్రీరామచంద్రునకుఁ గళంకము గలిగిన నేను మాత్రము బరి హరింపవలసినదానను గానా"? అనినది. మఱియుఁ బ్రజలను సోదరులవలెఁ జూచుకొనుచు ధర్మప్రవర్తనుల జేయుటకుఁ జేసిన యీపని పరమధర్మ మనినది లోకమునఁ గీర్తికన్న మిన్న లేదనినది. జానకియొక్క యీపవిత్రభావము మన స్సునఁ దట్టియుండుటం బట్టియే దాశరథి పామరులగు ప్రజ లధర్మపథమున కభిముఖులు కాకుండుటకు సీతను గంగకు దక్షిణముగాఁ దమసా నదియొడ్డున నున్న వాల్మీకి తపోవన మున నిర్జనముగా నుండునెడ దించిరమ్మని లక్ష్మణున కాజ్ఞ యొసఁగెను. సీతను లక్ష్మణుఁడు దించివచ్చిన చోటు వాల్మీకి యాశ్రమమున కెక్కువ దూరమున లేదు. ఇక్ష్వాకువంశమున గౌరవము గలిగి దశరథున కిష్టసఖుఁడై శ్రీరామచం ద్రుని సుచరిత్రము నెఱిఁగియున్నవాఁడు వాల్మీకి. అమ్మహర్షి

యి మ్మహాపతివ్రతామణి యోగక్షేమము లరయఁగలడని శ్రీరాములవారూహించియుందు రేమో ! శ్రీరాముఁడు ఘోరమోడి సీత కీయంశము నగరమునఁ దెలుపలేక పోయెను.

లక్ష్మణుఁ డవనిజను గంగ యవ్వలి యొడ్డునఁగల వాల్మీకితపోవనమున దించి శ్రీరామాజ్ఞను జెప్పలేక ఖిన్నుఁడై యేడ్చుచుండెను. సీత నిర్బంధముచే నెట్టకేలకు శ్రీరామాజ్ఞ నిట్లు వచించెను. 'సభా మధ్యమున శ్రీరాముఁడు నిన్నుఁగూర్చి దేశములో వ్యాపించియున్న దారుణాపవాదమును విని సంతప్తహృదయుఁడై నన్నీపనికి నియోగించినాఁడు. నేను నిన్నిచట వదలిపెట్టి పోవలసినవాఁడనై యున్నాడను. ఈ గంగాతీరమున నిది పవిత్రమును రమణీయమునైన బ్రహ్మర్షుల తపోవనము. మహాయశస్సంపన్నుఁడు విప్రుఁడు వాల్మీకిమహర్షి యిచటఁ గలఁడు. ఆయన మాతండ్రిగారి కిష్టసఖుఁడు. ఆయనపాదముల నీడ నీ వుపవాసపరాయణురాలవై సుఖముగ నుండుము. శ్రీరాముని హృదయమున నిల్పికొని పతివ్రతవై మనుము. నీకు మంచి శ్రేయస్సు గలుగును.'

ఇట్లు చెప్పి లక్ష్మణుఁ డేఁగినపిదప శ్రీరామవియోగ దుఃఖమున మూర్ఛిలి లేచి జానకి యేడ్చుచుండఁగాఁ ఋషికుమారులు చూచి పోయి వాల్మీకికిఁ జెప్పిరి. ఆయన దివ్యదృష్టితో నంతయు నెఱింగి యర్ఘ్యముఁ గొనివచ్చి "నీవు శ్రీరాముని భార్యవు. దశరథుని కోడలవు. నీయందే పాపమును లేదు. నే నెఱుఁగుదును. నాపరిసరమునకుఁ జేరినావు.

కావున నీ విక నాకులపడవలదు. మా యాశ్రమసమీప మునఁ గొందఱు స్త్రీలు తపశ్చర్యాపరాయణులై యున్నారు. వారియొద్ద నీవు సుఖముగ నుండవచ్చును; రమ్ము" అని యామెను దోడుకొనిపోయెను. సీతయు ఋషి వెంటఁబోయి యా తాపస స్త్రీల సందర్శనముఁ జేసెను. వాల్మీకి యామె కులగోత్రములఁ నెల్లఁ జెప్పి యామెయోగ క్షేమముల నరయుచుండుఁడని వారల కామెనప్పగించెను.

౨

శత్రుఘ్నుఁడు లవణాసురుని జంపఁబోవుచు వాల్మీకి యాశ్రమములో నొకరాత్రి నివసించెను ఆరాత్రియందే కుశలవులు పుట్టిరి. అయ్యుదంతమును విని యానందవశీ శత్రు ఘ్నుఁ డరిగియుండెను. ఇట్టిసందర్భములంబట్టి చూచిన జానకీ వృత్తాంత మయోధ్యకుఁ దెలియవచ్చుచునే యుండవచ్చు ననిపించు కాని శ్రీరామచంద్రుఁడు పరార్థతత్పరుఁడగు టచే భ్రాంతులై యున్న ప్రజలలో నధర్మదృష్టి యేర్పడునో యను భయమునను అపవాదభీరుత్వమును ధర్మమును నెల కొల్పుటయందలి దీక్షచేతను సీతయోగక్షేమముల నరయుట మొదలైన యంశములను బూర్తిగ వదలుకొని యుండును. బంగారు సీత ప్రతిమను బెట్టుకొని యజ్ఞము లొనర్చుచుండెను. ఇది సీతారాముల విశుద్ధప్రణయమును సూచించుచున్నది. ధర్మమునకు సామ్రాజ్యము నిచ్చి యనురాగమును దృణీకరిం చుట ధార్మికులచరిత్రలలోని పవిత్ర చిహ్నము.

ఈరీతినున్న వాల్మీకిరచననుబట్టి చూచిన నుత్తరరామచరిత్ర నాటకమునందుఁ గన్పట్టినంత కాఠిన్యము శ్రీరామచంద్రుని యెడమనకుఁ గన్పట్టదు. “సౌమిత్రీ! నా భర్తయొక్క రాజవంశమునకు హాని వచ్చును గాన నేను గంగలోఁ బడి ప్రాణహత్యఁ జేసికొనను” అనిన సీత సౌశీల్యగరిమయు భగ్నము గాదు. భవభూతి సీతచేత,

“హా ఆర్యపుత్ర ! కుమారలక్ష్మణ ! ఏకాకినీం అశరణాం ఆసన్నప్రసవవేదనాం హతాశాం శ్వాపదా అభిలషంతి”

అనిపించుచున్నాఁడు. శోచనీయదశయొక్క పరమావధియే సీతయందుఁజూపఁబడినది. ఘోరారణ్యములో దిక్కులేక యొంటిగ విడిచిపెట్టఁబడుట ప్రసవకాలబాధ యేర్పడుట దుష్టమృగములు తనమాంసమునకై వచ్చుచుండుటయనునీస్థితికంటె నింకొకకష్టము లోకమునఁ గలదా? ఇట్టికష్టములకుఁ దాళఁజాలక జానకి గంగలోఁ బడినది. ఎంతటియాపద ! సీత నిట్టియాపదకు గురి యగునట్లు చేసిన శ్రీరాములవారిని భగవంతుఁ డనెడిదృష్టి విడనాడి చూచితిమేనిఁ ఆయనకన్నఁ గఠినుఁడును ఆలోచన లేనివాఁడును స్త్రీప్రియుఁడును గనుపట్టఁడు. పలుచోట్ల నీప్రసంగమును దెచ్చి భవభూతి యీ మహావిపత్తును మనచెవుల కతికఠోరముగ వినిపించుచుండును. లవుఁడు చదివిన రామాయణశ్లోకమువలన సీత జన్మస్థితి కీరాఁగా జనకుఁ డనుచున్నాఁడు.

"నూనం త్వయా పరిభవంచ వనంచ ఘోరం తాంచ వ్యథాం ప్రసవకాలకృతామవాప్య, క్రవ్యాద్గణేషు పరితః పరివారయత్సు, సంత్రస్తయా శరణమిత్యసకృత్స్మృతో௨హమ్."

ఇందులోఁ బైకష్టములలో లోకులయపవాదమువలనఁ గలిగిన యవమాన మొకటి చేర్పఁబడినది. సీతయు నిట్టి భావము గలిగియుండినట్లు "నసహిష్యే అనుభవితుం జీవలోకస్య పరిభవం" అనుచున్నది.

శ్రీరాముఁడును సీతకుఁ దాను గలిగించిన యాపదను గూర్చి యిట్లనుచున్నాఁడు.

"శైశవాత్ప్రభృతి పోషితాం ప్రియాం, సౌహృదాదపృథగాశ్రయా మిమామ్; ఛద్మనా పరిదదామి మృత్యవే, సౌనికే గృహశకుంతికా మివ."

మఱొకచో—

విస్రంభా దురసి నిపత్య జాతనిద్రా మున్ముచ్య ప్రియగృహిణీంగృహస్యశోభామ్, ఆతంకస్ఫురితకఠోరగర్భగుర్వీమ్, క్రవ్యాద్భ్యోబలిమివ దారుణః క్షిపామి.,,

అనుచున్నాఁడు. మఱియొకచో—

"క్రవ్యాద్భి రంగలతికా నియతం విలుప్తా" అని తలంచుచున్నాఁడు. తృతీయాంకమున వాసంతి యిట్లు విలపించుచు రాముని దూషించుచున్నది.

"అయి కఠోర, యశః కిల తే ప్రియం, కి మయశో ననుఘోర మతః పరమ్; కి మభవ ద్విపినే హరిణీదృశః, కథయ నాథ! కథం బత మన్యసే.,,

ఈసందర్భములవలన వాల్మీకి సాయమున కవకా శము గలుగునట్లు వాల్మీకితపోవనసమీపమున సీతను లక్ష్మ ణుఁడు రామాజ్ఞచే వదలివచ్చెననుమాటయే పూర్తిగా భవ భూతిచే విడనాడఁబడినట్లు కన్పట్టును. దీనిచే భవభూతిగారి కేమి సిద్ధించినది? రససమృద్ధి సిద్ధించినది. సాధింపఁదలఁ చుకొనినది శోకాతిశయము. దాని కాలంబనమైన సీత నతి శోచ్యదశలోఁ జూపవలెను. అందుద్దీపనములుగ వెనుకఁ జెప్పఁబడిన దారుణాపదన్నియు సీతయందుఁ గూర్పఁబడినవి. దీనివలన శ్రీరామచంద్రులవారి కత్యంత కఠోరత కళంక ముగా నేర్పడుచున్నది.

"నఖల్వద్యైవ సౌమిత్రే! జీవితం జాహ్నవీజలే త్యజేయం రాజవంశస్తు భర్తుర్మే పరిహాస్యతే."

అను సీత శుద్ధబుద్ధి మాసిపోవుచున్నది. కాని దాని పై పునకుఁ గవిదృష్టి ప్రసరించలేదు. రసప్రవాహమున నిమీ లితనేత్రుఁడై యోలలాడుచున్నాఁడు. ఇచ్చట సహృద యులును శ్రీరామ పాత్రౌచిత్యము మనసునకుఁ దాఁకనంతటి తన్మయత వహింపవలయునని కవికోరికయై యుండవచ్చును.

జనకుని యౌచిత్యము సైత మొకవిధముగఁ గన్పట్టు చున్నది. బ్రహ్మవేత్త యగు జనకుఁడు జ్ఞానవైరాగ్యనిధిగాఁ జూపఁబడవలసియుండియు సీతాశోకమున మిగుల ఖేదమందు చున్నట్లు వర్ణింపఁబడుచున్నాఁడు.

„న మే నికృంతన్ మర్మాణి క్రకచఇవ మన్యుర్విగ హంతి,, „ప్రత్యగ్రఇవమే దుఃఖసంవేగో న శామ్యతి,,

ఇత్యాదిచతుర్థాంక వాక్యములీయంశమునఁ బ్రమాణములు.

మఱియు శోకాతిశయమునం గలిగిన కోపముగూడ జనకునందుఁ జూపఁబడినది కౌసల్య దుఃఖలజ్జాది పరవశయై వసిష్ఠాశ్రమమునఁ దన్నుఁ జూచుటకు వచ్చి యీయవస్థలో జనకు నెట్లు కనుఁగొనుదునా ? అని సంశయించుచు నధోముఖయై యున్నది అప్పుడామెను జూచి జనకుఁడు నిందాగర్భముగాఁ బ్రజాపాలకుని తల్లి కార్యోగ్యమా„ అనుచున్నాఁడు. ఈనిష్ఠుర వాక్యముచే సగము చచ్చియున్న కౌసల్య పూర్తిగాఁ జచ్చిపోయినది.

„లక్ష్మణుఁడు సీత నడవిలో వదలె,, నని రామాయణ కథను లవుఁడు చెప్పఁగా,

„ఏతద్వైశసవజ్రఘోరపతనం శశ్వన్మమోత్పశ్యతః
క్రోధస్య జ్వలితుం ఝటితి త్యవసరశ్చాపేన శాపేన వా.,,

అనిజనకుఁడు శాపముఁ బెట్టఁబోవుచున్నాఁడు చూడుడు. ఎంతటి వ్యాకులత్వమును ఎంతటిశోక మోహాపారవశ్యమును బ్రహ్మవేత్తయందుఁ జూపుచున్నాఁడో!

దీనివలన నిట్టి జ్ఞానుల జ్ఞానబలమును సైతము తల క్రిందులు సేయఁగలిగిన శోకమును సమృద్ధిగఁ జూపఁగలిగి

సీత యెంతటి ఘోరాపదలపాలయినదో మనకుఁ జూపుచున్నాఁడు. ఇవి రససిద్ధులగు మహాకవులపోకడలై యుండును.

రసప్రవాహములందును అలంకారరంజనములందును సర్వార్థమును జరిత్రముగఁ దీసికొనరాదు, చమత్కారకాండమును వేఱుపఱిచి వాస్తవార్థమునఁదిగి పాత్రౌచిత్యానుసంధానము సేయవలెను. ఇట్టిదృష్టి నుపయోగించితిమేని వాల్మీకిప్రోక్తమును భవభూతి యన్యథా చేసినదెల్ల రసపోషణమునకే కాన సీతారామపాత్రౌచితి వాల్మీకి ప్రోక్తమందే ఆయత్తమై యుండును.

---

## భవభూతిరసము—కాళిదాసుని పాత్రౌచిత్యము.



సీతను గూర్చిన వాత్సల్యమును శోకద్వారమున జనకునియందు సమృద్ధిగ సాధింపఁదలఁచిన భవభూతి కవిబ్రహ్మ శ్రీరామునివలన సీతకుఁగలిగిన ఘోరాపదను స్మరించుచు శోకవిహ్వలుఁడగు జనకుని నుత్తరరామచరిత్ర నాటకమున మనకుఁ జూపుచున్నాఁడు. సీతకుఁ గలిగిన మహాపదను విని జనకమహారాజు గార్హస్థ్యమునుండి విరక్తుఁడై

వానప్రస్థాశ్రమమునఁ బ్రవేశించి చంద్రద్వీప తపోవనమునఁ దపస్సు చేసికొనుచున్నాఁడు; మాంసాహారము మానినాఁడు. ఎల్లప్పుడును హృదయమును బాయకున్న సీతాశోక మాయ వను ఎండఁబాఱినచెట్టును తొఱ్ఱలోఁజేరిన నిప్పువలెఁ గాల్చి వేయుచున్నది. కూఁతునకుఁగల్గిన దురితము హృదయమునఁ బుండుచేసి నాటుకొని ధారావాహియైనశోకమును బుట్టించు చున్నది. అది యాయువుఁబట్టులను ఱంపమువలెఁ గోసివేయు చున్నది. విరమించునట్లులేదు.

ఈ ముసలితనమునకుఁదోడు దుఃఖము; దానికిఁదోడు తపస్సులు; వీనిచే మిగులనెండుచుండియు నాయీపాడు దేహము పడిపోకున్న దనుకొనుచు విషాదమందుచున్నాఁడు. నరకముల పాలగుదునను భయము నాత్మహత్యా ప్రయత్న మునుండి జనకుని మఱల్చుచున్నది. ఎన్నియేండ్లు గడచినను బ్రాఁతపడక సుస్పష్టముగఁ గన్పట్టుచు దుఃఖసంవేగము శమింపదయ్యె. నిశ్శంకగా నేడ్చుటకైన వీలులేకపోయె. నీ నిర్భాగ్యమిట్టిది. అనుకొనుచు లజ్జాశోక పరవశుఁ డగుచున్నాఁడు జనకుఁడు. సీతయొక్క పవిత్రత ననుసంధా నము సేయఁకొలఁది జనకుని కొకప్పుడు పుత్రిక యనుభావము పోయి యామెయెడ భక్తి గలుగుచు వచ్చెడిదట. అట్టిసీత యోగ్యత జనకుని శోకసమృద్ధి కిప్పు డుద్దీపన విభావ మగుచున్నది.

„ఆసన్నప్రసవవేదన యగు సీత నొంటిగ నడవిలో వదలి లక్ష్మణుఁ డింటికిఁ బోయెను.„ అనువాక్యము లవుని

నరసవాక్కునుండి వినునప్పటికి జనకునికి దేహము తెలియు లేదు. శోకనిమగ్నుఁడయ్యె. సీతా! ఏకాకినివై నసీశరీర కుసుమమున కెట్టి దైవదుర్విలాస పరిణామము కల్గెను? పరా భవమును, ఘోరారణ్యా వాసమును, ప్రసూతి బాధయు, దావరించి యుండఁ గ్రూరమృగములు చుట్టుకొనుచుండ నన్నుఁ బలుమాఱు స్మరించి యుందువు. అక్కటా! పౌరు లెంత నిర్దయులు? రాముండెంతటి యవిమృశ్యకారి!

పిడుగువంటి యీ ఘోరహింసను ఆటె తలపోయఁగా శాపముచేఁగాని చాపముచేఁగాని కోపమును బ్రజ్వరిల్లఁ జేయవలసిన యవసరముగనే యియ్యది కనఁబట్టుచున్నది. అని యాజ్ఞవల్క్య శిష్యుఁడు శాపమునకో యుద్ధమునకో సిద్ధమగుచున్నాఁడు. చూడుఁడు. "కర్మణైవహి సంసిద్ధి మాస్థితాజనకాదయః" అని భగవద్గీతలలోఁ గూడ మహాజ్ఞా నిగాఁ బేర్కొనఁబడిన జనకునంతటివాఁడిట్లు శోకమోహా ములకు వశుఁడయ్యెననుట పాత్రౌచిత్యమునకు లోపము వా టిల్లఁజేయునో యనుశంక గల్గుచుండలేదా?

కాని దీనిచే రసమున కత్యంతసమృద్ధి సమకూరక పోలేదు. ఇట్టివి రసపక్షపాతవశులగు కవుల స్వైరసరచనలు. అభిజ్ఞానశాకుంతల నాటకమున శకుంతల పతిగృహమున కేగు నప్పుడు కణ్వుఁడుసైత మిట్లే దుఃఖితుఁడగుచున్నాఁడు. సీత మృతినొందియుండునని జనకుఁడు దుఃఖించుచున్నాఁడు. శకుంతల తనయాశ్రమమును బాసిపోవుచున్నదని కణ్వుఁడు

శోకించుచున్నాడు. జనకుని శోకముకన్న కణ్వునిశోకము కనీయముగనే కనబట్టుచున్నది. ఐనను గవులీసందర్భములలోఁ గణ్వజనకులయందు సాధింపఁదలఁచుకొనినది కరుణరసమే. కాని సమానమైన రచనాపథమందే కాళిదాసభవభూతులిచ్చట నడచుచున్నారు. ఇట్టిచోఁ దారతమ్యము వీరి శైలిభేదమునే సూచించును.

యాస్యత్యద్య శకుంతలేతి హృదయం సంస్పృష్ట ముత్కంఠయా, కంఠస్తంభిత బాష్పవృత్తికలుష శ్చింతాజడం దర్శనమ్; వైక్లబ్యం మమ తావ దీదృశ మహో! స్నేహాదరణ్యౌకసః పీడ్యంతే గృహిణః కథంను తనయావిశ్లేషదుఃఖైర్నవైః.

శకుంతలా ప్రయాణమును దలఁచుకొను కణ్వుని హృదయ ముత్కంఠ చింతమున్నగు వ్యభిచారిభావములకు వశమైనది. బాష్పము ప్రళయము మున్నగు స్వాత్త్వికభావములు పొడముచున్నవి. జనకునియందైన నంతకన్న శోకసమృద్ధి భవభూతిచే నెక్కుడు సాధింపఁబడలేదు. శోకసూచకమైన వాగ్వినియోగము మాత్రమే యెక్కువగఁ గూర్పఁబడినది. శ్రోతలకుగర్భనిర్భేదకములగు మాటలచే రసప్రవాహమును వెల్లిగొల్పుచుంటయును అన్యోన్యపాత్రల చేష్టలు మున్నగువాని చేతను దేశకాలపరిస్థితుల నమర్చుటచేతను రససంపూర్తిని నిర్వహించుటయును ఆయాకవులపోకడలలోని భేదములు.

కాని యిచట నొకభేదము గన్పట్టుచున్నది. కణ్వుఁడు ,,వైక్లబ్యం మమ తావదీ దృశ మహో!,, అనుకొనుచున్నాఁడు. తనకట్టిశోకమును, అట్టియుత్కంఠయు, అట్టిచింతయుఁ గల్గుటనుగూర్చి యమ్ముని, యాశ్చర్యమందుచున్నట్లు ,,అహో,,అను నవ్యయము సూచించుచున్నది. విస్మయ మారీతిగ నప్పుడుగల్గుటకు నిర్వికారచిత్తతయను శమము స్థాయిగనుండవలెను. అట్టి శాంతరసస్థాయిభావమగు శమము నెలకొనియుండుటచేతనే వికారహేతువు శకుంతలాస్నేహముసఁ గల్గుచున్నను మనస్సును వికృతినందనీయని ధీరత కణ్వునిలో భాసిల్లుచున్నది. తరఁగములవలెఁ బైకొనుచున్న శోకవికారములను కణ్వుఁడను శాంతిసముద్రము మ్రింగివేయుచున్నది. అట్టి పరిస్థితిలోఁ దన సహజశాంతితరంగముల యుత్పత్తిలయములను జూచి కణ్వమహర్షి విస్మేరచిత్తుఁడగుట యుక్తముగ నున్నది. శోకమోహ పరవశుఁడగువానికి, ,,వృత్తిసారూప్యమితరత్ర,,అనినట్లును, "యోయచ్ఛ్రద్ధ స్స ఏవ సః" అనినట్లును, ఆయాశోకాదివికారముల నైక్యమంది తలక్రిందులగుచుఁ దాదాత్వికవాంఛాపూర్త్యన్వేషణవ్యగ్రుఁడగుచుండుటయే కాని వానినిగూర్చి యాశ్చర్యమందునంతటి విశ్రాన్తియుండదు. "అద్భుతశ్చతథావీరాత్" అనుటచే వీరరసమువలన నద్భుతము గల్గవచ్చును. వైరాగ్యవీరత శత్రువులయిన వికారములను బరిమార్చుచుండుటం గూర్చియైనచో విస్మయముకల్గుటొప్పు.

మఱియు నిటఁ గరుణరసము ప్రధాన మైనచో, దాని యంగములైన యుత్కంఠాచింతలు వాచ్యములు కాఁగూడదు అనువాదములనుటగాక యింకొకదారికలదు. శాంతరసము ప్రధానమైనచో, దానిని బ్రబలము సేయుటకుఁ గైకొనఁబడిన కరుణరససంచారిభావములు వ్యంగ్యములైన సూచ్యమైన శాంతికి వ్యవధాన మేర్పడుఁగాన రసికజనరంజనము తొంద రగాఁగాదు. కాన వాచ్యములైన యుత్కంఠాదు లిచ్చటఁ గణ్వునియందు నెలకొనిన శాంతరసము సూచించుట యందే పర్యవసాన మందుచున్నవి.

ఇట్లు రసములు సాధించుటచే మహాకవిగారి సముచిత రససంధానచాతురి వెల్లడియగుచున్నది. స్థిరమైన శాంతర ససిద్ధి కణ్వునియౌచిత్యమును బోఁగొట్టక నిల్పుకొను చున్నది. కరుణరసప్రతిఘటన ప్రబలముగ సూచితమై యు ప్పుడు కావలసినకరుణరససమృద్ధిని దక్కువగాకుండఁ జేయు చు వాత్సల్యపోషణ మొనర్చుచున్నది. మైత్రీకరుణా ముది తోపేక్షలభావన ఋషి కనుచితముకాదు.

ఆప్రసంగమునకుఁ గావలసిన కరుణరసమును అంగము గఁ జేసియు, మహర్షియౌచిత్యమును నెలకొల్పఁ గలిగిన శాంతరసమునంగిఁగఁ జేసియు, ధ్వనిప్రస్థానమునఁ దాండవమా డించిన మహాకవి కాళిదాసుని యౌచిత్యపక్షపాతము నిరర్గళ ప్రతీతి వహించుచు "అనౌచిత్యాదృతే నాన్య ద్రసభంగ స్య కారణమ్." అనెడి లాక్షణిక గ్రామణులకు మార్గదర్శి యగుచున్నది.

# ఉత్తరరామచరిత్రనాటకము

# భవభూతిహృదయము.



1. శ్రీనివాసుని యవతార మైనవాఁడు
నిర్మల గుణాకరంబయి నెగడువాఁడు
న్యాయ్య విక్రమమునకు స్థాన మగువాఁడు
రామచంద్రుఁ డెప్పుడును గ్రూరమతి కాఁడు.

2. రసముఁ బోషించుటకు నేను రామచరిత
నన్యథా చేసియుంటి నయ్యై తెఱంగుల
దాని నిజమైన కథగాఁగఁ దలఁచి లోకు
లకట ! భ్రమపడుచుండిరటంచుఁ దెలిసె.

3. అమలినుఁడు ధర్మవిదుఁడు దయామయుండు
రామచంద్రుఁ డెక్కడఁ? గఠోరముగఁ గ్రూర
ఘోరమృగ సమాకుల వనక్షోణియందు
జనకతనయను డించి రమ్మనుట యెడ?

4. శోకము సమృద్ధిగాఁ దోఁచి చొక్కఁ జేయ
వలయు రసికాళి నన్న భావప్రవృత్తి
కొఱకుఁ గథను మార్పఁగవచ్చు సరసరీతి
నగు నిది రసజ్ఞ సంప్రదాయక్రమంబు

5. అట్టి రససంప్రదాయంబు నాశ్రయించి
భయముగా మీఁదఁబడవచ్చు శ్వాపదముల
నడుమ లక్ష్మణస్వామి జానకిని డించి
వచ్చె రామాజ్ఞనని నేను వ్రాసియుంటి.

6. రమణిని దలంచుకొని యేడ్చు రఘుకులమణి
కామెయార్తి యుద్దీపక మగును గాన
ఆమె దుస్థితి శోచనీయమగు పొంకె
నడవిమెకముల కాహార మయ్యెనంటి.

7. పిలిచినం బల్కునట్టి వారలును లేని
కాఱడవిలోనఁ గ్రూరమెకాలనడుమ
లక్ష్మణుఁడు డించె సీత నాలలన కట్టి
సమయమే ప్రసవించెడు సమయ మంటి.

8. పడఁతి యాకష్ట మనుభవింపంగలేక
తొందరగ గంగలోనికి దార్లైనంటి
నిట్టి సీతయాపద తల యెత్త నీక
యుమ్మలిక రాము ముంచివేయు ననుకొంటి

9. అట్టి రామునిశోకంబు శబ్దార్పితమయి
చర్వణాబలమునను రసముగ మాఱి
యార్ద్రహృదయులనెల్ల రసాబ్ధిలోన
మున్గలం జేయునను రసమతముఁ గొంటి.

10. ఎన్నఁడో బాల్యమందుఁ దానెత్తి పెంచి
నట్టిజనకుండు బ్రహ్మవిద్యావిదుండు
ధరణిజాతకై వత్సలతాప్రయుక్త
శోకమున మున్గిపోవుటఁ జూపియుంటి.

11. దండకారణ్యమునఁ దడ వుండి నట్టి
సీత మంచితనంబెల్లఁ జిత్తమునకు
వచ్చియుండిన కతన, జానకిస్థితి వినఁ
బడుట వాసంతికిఁ గుండెపగిలె నంటి

12. తమకును వసిష్ఠునకు నరుంధతికి దశర
థావనీంద్రుని భార్యల కందఱకును
సీత యాపద తాపంబుఁ జేసె ననుట
వెలయుటకె వారలఁ బ్రవేశపెట్టియుంటి.

13. ఇది యశేషము శోకసమృద్ధి రామ
చంద్రునందు సాధింపంగ సాధనమని
నాదుదృష్టి. శ్రీరామచంద్రప్రభు వొక
ధర్మవీరుఁడుగా దీనఁ దనరఁ గలఁడు.

14. ఇట్టు లెల్లువలై పాఱునట్టి కరుణా
రసమును దిరస్కరించి ధర్మప్రజాను
రంజనోత్సాహ మున్న శ్రీరామ భూవ
రుండు ధర్మవీరులఁ బ్రధానుండు గాఁడొ?

15. ఇట్టి శోకాబ్ధిలో మునకలేని యొప్పి
ధాత్రి నిక్ష్వాకుకులుల గోత్రవ్రతముగ
జానుమీఱు ప్రజానురంజనమె చూచు
కొనుట ధర్మవీరుని చిహ్నమనఁగఁ దగదె ?

16. ప్రేమపరమావధిని రఘువీరునందుఁ
జూపవలెనను పూన్కిచే శూద్రమౌని
వధనెపంబున దండకావనికి మరల
రామునీడిచితిని రసరక్తిమున్ని.

17. అవనిసుతతోడ మున్ను సౌఖ్యముగనున్న
దేశములుగాంచి, జానకిదేవి యాట
నేర్చిన మయూరమున్ జూచి, నిజసతి ప్రణ
యమునఁ బెంచిన కరికలభముఁ గనుగొని

18. పంచవటిలోన నా రామభద్రుఁడపుడు
సీతను దలంచె; విలపించె. చింతమించె
మూర్ఛలోదించెఁ. బ్రియసతిముద్దు కేలు
సోక జీవించె రాముఁడంచు నొడివితిని.

19. రసనమగ్రత కను కార్యనసదృశమగు
హృదయపరిపాకమెయ్యది యిష్టమో ! క
వీశ్వరులకది సిద్ధించె నిచటఁగొంత
రసనమాలంబనంబగు రాముననందు,

20. మరల లవుని పద్యము వినంబడినయపుడు
రామచంద్రుని యాత్మలోఁ బ్రేమముఁ బరి
పాకమింకను శోకసంవర్ధనమునఁ
గలుగఁజేసినాఁడను రసఘట్టమెక్క.

21. అంతర్నాటికయందు ని
రంతర పోపుష్యమాణరసము రసికను
స్వాంతములకెక్క సీతా
కాంత విపద నిశితి రాము కన్నుల యెదుటన్.

22. సీతతోఁ జిత్రపటము వీక్షించునపుడు
దండకావనోద్దేశముల్ దఱిసినపుడు
నాటకమున సీతార్తి గానఁబడినపుడు
మూర్ఛఁగాంచెను శ్రీరామభూమివిభుఁడు.

23. మూఁడుమూర్ఛలలో, నొకమూర్ఛకన్న
మఱొకమూర్ఛ రసావేశమహిమనింపు
సీత కేల్సోక రాముండు సేదదీఱి
తెప్పిఱిలుట ప్రేమావధికొప్పుతీరు.

24. పదిమారదశల మూర్ఛయె
తుదిదశ స్మృతివర్ణనంబు దోషంబగుటన్
అది చూపఁబడియెఁ జిత్రమా
స్పదతా తత్త్వంబు రామభద్రుఁడుగాఁగన్

25 జనకుఁడు వసిష్ఠహాని కౌసల్యాకైక
మొదలయినవారు రాముని యెదుటఁబడుట
రాముపరిణతశోకసామ్రాజ్యమునకు
దుర్గసంరక్షణంబని తోఁచె నాకు.

26. అట్లగుట వారి నాల్గవయంకమునఁ బ్ర
వేశపెట్టి వారల భావవీథి నిలిచి
యుచిత భావశాబల్య మొండొరులఁ గూడి
నపుడు చూపితి లోకసహజముగాఁగ.

27. అప్రియంబు నాశంకించు నాప్తహృదయ
మండు ప్రియసతియెడ రాముఁడప్రియంబు
వనటచేత నాశంకించె ననఁగఁదగదె?
కాఁగలదె? హానిభావనఁ గరుణరసము

28. అల్ల శాకుంతలంబు షష్ఠాంకమందు
నిఁగ శకుంతల దొరకుట గగనకుసుమ
మనఁడె దుష్యంతుఁడంత మాతృన కరుణర
సము నభిజ్ఞానశాకుంతలమున నగునె?

29. ప్రాణము లేచివచ్చినది పాణిపదంబగు వస్తువైన యా
జానకితోఁక జేరికని చాలెడి యాభవభూతి భావమె
వ్వానికె యుంగనొ.ప్రణయుబంధరహస్యము విప్పిచెప్పఁగాఁ
బూనుమహాకవీశ్వరుల పోకడలివ్వి రసప్రణాళికల్.

30. రసము చిప్పిలునట్లుగా వ్రాయుచోట్ల
రసముఁ బోషించుకొఱకు వర్ణన మొనర్పఁ
బడిన వెయ్యవియో ! వాస్తవంబు లెవియొ !
అని విమర్శించి కవిభావ మరయవలయు.

31. అందమైన యర్థాలంక్రియలను గాని
లలితరసవదలంకారములను గాని
అధికమౌ కవిప్రౌఢోక్తులందుఁ గాని
వర్ణనల వస్తువును వేఱుపఱుపవలయు.

32. తథ్య మస్మృతము గల చమత్కారసార
వర్ణనములందు లీనమై వస్తు వృష్ణా
సొదిగి యల్లిన కాకరపాదలలోన
కానఁబడకుండు పచ్చనికాయవ్రాలె.

33. అట్టి వస్తువుల్ వర్ణనాభ్యంతరముల
మిణుకు మిణుకులాడుచునుండి మెఱయుదాని
గావ్యములలోనఁ బ్రతిభచేఁ గనఁగవలయు
నట్లు కానినాఁడు చరితం బస్మృత మగును.

34. అర్థవాదంబులఁ దొఱఁగి యర్థములను
గైకొనెడిరీతి వేదాలఁ గానఁబడును
అట్టి సంప్రదాయంబె కావ్యాదులందు
వస్తువును గ్రహియించెడు పట్లనలయు.

# వాల్మీకియుత్తరరామచరిత్ర.



35\. సత్యముగ వ్యాసులూరుసంజాతుడః ఋషి
రాజుసుకవి ఋతంభర ప్రజ్ఞచేత,
రచనచేసిన యుత్తర రామచరిత
పొందుపఱుతునిప్పుడు మనస్ఫూర్తిగాఁగ

36\. ఒక్కఁడెవ్వఁడో చాకలి యక్కరణని
జానకిని దూఱెననుట యసత్యవార్త
యెల్లయెడలఁ బ్రజలలోన కొల్లగాఁగఁ
బ్రబలిపోయెనా మిథ్యాపవాదమపుడు

37\. ప్రజలలోన నాబాలగోపాలముగను
రావణుఁడు గొనిపోయిన రమణిఁ దెచ్చి
యేలుకొనుచుండె రాముఁడం చేవగించి
చర్చలొనరించుచుండిరి సభలుచేసి

38\. ఎక్కడఁగా వినఁబోయినఁ బెక్కుగతుల
రాముఁగూర్చియు జానకీరమణిఁగూర్చి
నిందలేవినఁబడఁజొచ్చె నిజముదాఁప
రామిచేఁదెల్పె భద్రుఁడు రాముసెదుట

39\. ఆప్తులను రాఘవుండధి కార్తితోడ
నడిగెనిది యెట్టిదనుచువారందఱవని
మీఁదసాఁగిలఁబడి మ్రొక్కి మేదినీశ
సూనృతంబదియని రతిదీనముగను.

౧ వ నిశ్వాసము.

40\. దానివిని సర్వధర్మసంస్థాపకుండు
రాముడనుకొనె-సద్ధర్మసీమకేమి
భంగములువాటిల్లునో ! ప్రజలలోన
ధర్మమర్యాద కాపాడఁ దరమెయిట్లని?

41\. ధర్మమార్గ యాత్రికులకు నిదర్శనముగ
నెల్లవిధములలోనను బృథివీశుడున్నఁ
బ్రభువుమీఁదఁ బ్రామాణ్యంబు ప్రజకుఁగల్గు
దానిచేతను ధర్మసంస్థలిలనడచు.

42\. భూజనులనిన గ్గోవులు
రాజేగోపాలుఁడనుసరణము ల్లైఁయథా
రాజాతథా ప్రజా''యని
యీజగమున నాడుకొనుట యెఱుఁగనియదియే?

43\. సృష్టికాలమాదిగఁ బ్రజకెల్లనచ్చి
పూర్ణధర్మస్థితిఁ బ్రమాణభూతులైన
రఘుకులధురంధరుల కులకీర్తి మెల్లఁ
గటకటా! నేఁడు కల్మషాక్రాంతమయ్యె.

44 స్త్రీజితుఁడు కామకౌతుకుఁడస్థిరవిషయను
షైకలోలుండు రాఘవుండనుకొనియెడ
రక్కట! జనులెల్ల వారికే నెట్టుల స్వైర
సప్రవృత్తిగల్గింతునో! సత్పథమున.

45. బలవదనుశాసనంబునఁ బ్రజలను వశ
వర్తులుగ జేయుటయు రఘువంశమునకుఁ
దగినపనికాదు ప్రజలసంతసపఱుచుట
తరణికులజుల ముఖ్యవ్రతంబుగాన.

46. ప్రజలు తమయంత తామె ధర్మప్రభువుల
లక్ష్యముగఁ జేసికొని తమలక్షణములఁ
జక్కఁజేసికొనుచునుంట సార్వభౌమ
లక్షణము. బలాత్కృతి నృపలక్షణంబె?

47. ప్రభువు నీచవర్తనుడంచు భ్రాంతిచేత
నైనఁ బ్రజలదపోయుటధర్మంబుగాదు
అట్టిప్రభు వెపుడాదర్శమై ప్రజలను
సుపథమున నడిపింప దక్షుండుగాఁడు.

48. అవనిపై నన్నివిధముల నభిమతంబు
కాకపోలేదు ప్రజలకిక్ష్వాకుకులము,
వెలసె వచనీయబీజంబు విధివశమున
నెట్టులగ్నిపరీక్ష వీరెఱుఁగఁగలరు?

49. సీతభావంబు నెఱుంగు నాచిత్తమొకండె
నాదుచిత్తంబు నెఱుంగు నానాతియొకతె
మాయుభయులమానసములు మాకుఁగాక
లోకమున కెఱుఁగంగ శక్యంబులగునె?

50. కొన్నిజీవులు చిదిపితాల్గొరికిబ్రదుకు
కొన్నిమనుసోగ వెన్నెలల్గ్రోలి పొదలు
భిన్నరుచులైనవానికిఁ బ్రీతిసరియు
తగవుకాదిందులోన నేకతరమా.

51. నాకునుంబోలె వ్రతము జానకికిఁ గూడ
సకలగతులఁ బ్రజానురంజనమె కాన
ప్రజలతృప్తినిగోరి ధర్మము సలుపఁగ
జనకతనయకుఁ గలుగదు సందియంబు.

52. అదియునుంగాక నగరసౌఖ్యములకన్న
వనవిలాసంబు లాయమ భావమునకు
నచ్చియుండుఁ దదీయమానసము ప్రకృతి
యట్టిదగుట యెఱుంగు నాయంతరాత్మ.

53. తమయభీష్టంబ లోకులందఱకభీష్ట
మనుచుఁదలపోయు టెప్డు యోగ్యంబుకాదు.
తమకు సుఖమైనదే సమస్తప్రజలకు
సౌఖ్యకరమనుటయుఁ బ్రశస్తంబుకాదు.

54\. పరిమళించుసెజ్జఁ బవ్వళించుచునిచ్చ
వసుధనేలుఁ జక్రవర్తిసుఖము
నినుకతిన్నెమీఁద నెక్కిగొంగడిలోన
మెలఁగువానిసుఖము మించఁగలదె?

55\. ఆశ్రమప్రాంతభూములయందు సీత
జింకపదుపులనడుమఁ బచ్చికబయళ్ల
సొంపుగనుగొంచు మిక్కిలి చొక్కఁగలదు
మానసముఁదన్ప సాయంసమయములందు.

56\. బక్షులను రెంటినింగూడ నొరసికొనుచుఁ
బాఱుచుండెడి తమసాప్రవాహములను
సరసతరనిర్మలోదక భరితములగు
చిన్నకాల్వలఁగని సంతసించుసీత.

3 నిశ్వాసము.

57\. శాంతివాంఛించి యరుదెంచు సత్త్వములకు
నిలువనీడ నొసంగెడి నిర్మలుండు
కలఁడుకాడె వాల్మీకి యఖండబోధ
ధనుఁడు ధర్మాత్ముఁడు తమసాతటమునందు.

58\.. పురుషులకు విద్యలొసఁగుచుఁ బూర్ణబోధ
విలసితులఁ జేయుపాఠశాలలొకకొన్ని
యంగనలకు సముచితవిద్యలనొసఁగఁగ
నిలుపఁబడినట్టి పాఠశాలలొకకొన్ని

59. తన పవిత్రాశ్రమమునందు ధర్మమార్గ
మునకుఁ జేయూతయొసఁగంగఁ దనరుచుండు
లోకసంగ్రహకర్త వాల్మీకి. యమ్మ
హామహుని యాశ్రయంబున నలరు సీత.

60. పలువురంగనలచటఁదపంబు విద్య
ధర్మమును జ్ఞానమును మోక్షకర్మములును
సతతమును విమర్శించుచు సత్యనిష్ఠ
కాలముంగడపుదురు సత్సంగకాంక్ష.

61. అచట సద్గోష్ఠి జరిగి ధరాత్మజాత
యాత్మ స్మరియింపఁబోదమోధ్యాసుఖమును
ఆజనస్థాన దినచర్యలనుభవంబు
నందు లేవె? జానకిశీలము భినవంబె?

62. ఇట్టులదీర్ఘాలోచన
పట్టుదలనొనర్చెఁగాని భావమునకు నే
పట్టునుదొరకకపోయెం
జిట్టచివరకిట్లు తేలిచెఁ గృత్యంబున్.

63. ఇట్టిచోనొక్కవ్యక్తి కిక్కట్టునుకొని
యందఱఁ జికాకుపఱుచుటన్యాయమగును
ఋషులయాశ్రమములవసియింపఁగోరి
యుండెజానకి. పంపెదనువిదనట్టకు,

౮ నిశ్వాసము.

64. తమ్ములఁబిలిపించి యుదం
తమ్మంతయుఁ జెప్పి జనకతనయఁగుఱిచి స్వీ
యమ్మైన యాశయము దుః
ఖమ్మున మునుగుచు వచించె గద్గదమెసఁగన్.

65. అవనిసుతశుద్ధి నెఱుఁగు నాయంత రాత్మ
హవ్యవాహనుఁడును మెచ్చి యనుమతించె
పరమపావనియని నభోవాణి పలికె
దేవతలయొద్ద నాకిచ్చె దేవవిభుఁడు.

66. ఇంతటి పరీక్షమీఁద మహీతనయను
స్వీకరించితి ధర్మవిశేషమునుచు
వీనిఁదప్పందురట పౌరజానపదులు
వసుధఁబ్రబలె నీమిథ్యాపవాదమిప్పుడు.

67. ఇప్పుడీయపవాద మెంతేసి మించెఁ
బట్టణంబులఁ బల్లెల బహువిధములఁ
గీర్తివంటి పూజ్యంబపకీర్తివంటి
నింద్యమును గానఁబడదుగా నిఖిలజగతి.

68. ఆర్యులగువారి యత్నముల్ యశముకొఱకె
వీడువాఁడ నేనపవాద భీతిచేతఁ
బ్రాణములనైన మిమ్మైన నవనిజఁ ద్యజి
యింపనొక్కొ! యింతటిదుఃఖ మెఱుఁగ నెపుడు.

69. అనుచులక్ష్మణుఁగని, యెదురాడవలదు
గంగ దక్షిణతటమునఁగలదు తమస
చెంతవాల్మీకి యాశ్రమం బింతినిగొని
పోయి యచ్చటడించిరమ్ము విజనవని.

70. నావుడంత వాల్మీకితపోవనమున
డించె లక్ష్మణుఁడడవిలోదింపలేదు
ఆతపోవనమపుడు విద్యలకు తావు
శాంతికి నికేతనంబు మోక్షంబుత్రోవ.

71. ఎండఱో స్త్రీపురుషులు మోక్షేచ్ఛనచట
జేరియుండిరి సత్సంగ సిద్ధికొఱకు
అచటిమంచికాలక్షేప మవనితనయ
కమృతపారణకన్నఁబ్రియముగనుండె.

72. ఇంతకఠినత రామునకెట్లుచితమ
టంచుఁ దోఁచుటయును విస్మయంబుకాదు
ధర్మవీరుని వజ్రాయుధమునుమించు
గట్టితనమది. యాచిక్కులట్టివపుడు.

73. ప్రజలఁ బ్రభుపై భక్తివిశ్వాసములు న
శించె నిశ్శేషముగదానఁజేసి జనులు
పాపభీతివీడిరి. రామభద్రుఁడెపుడు
సలుపఁడెట్టి బలాత్కారశాసనములు.

74. తన్ను బాయఁజాలని సీత తత్త్వమెఱిఁగి
సుదతినపుడు రాముఁడు కంటఁజూడలేక
పంపెఁజెప్పక. లక్ష్మణస్వామిదానిఁ
జెప్పలేకయే ఋషికంటఁబడకవచ్చె.

75. పట్టణంబులఁ బల్లెలఁ బ్రాకియుండె
సువిద! నినుగూర్చి యపవాదమొకటిమిగుల
దానివిని రాఘవుండు సంతాపమంది
నన్నుబంచె నడవులలోన నిన్నుడింప.

76. అవనివిభుఁడపవాదభయంబువలన
నదిగ్రహించెనుగాని గ్రాహ్యంబుగాదు
వహ్ని మెచ్చిన నీదుపావనత యేడ?
మంచియెఱుఁగని యజ్ఞులమాటల్లేడ?

77. విననిట డించి చనుట రామాజ్ఞ తల్లి!
పాతకపుమాటలవి నేను పల్కలేను
జాహ్నవీతీరమిది మనోజ్ఞంబు పుణ్య
మాశ్రమంబు బ్రహ్మర్షుల కాశ్రయంబు.

78. మెలఁగునిచట యశస్వి వాల్మీకిమౌని
ఆఋషిపదాంబుజచ్ఛాయ నాశ్రయించి
బుద్ధిలోపల శ్రీరామమూర్తినుంచి
కాలమును శాంతచిత్తతఁ గడపుమమ్మ.

79. మూర్ఛిలుచుఁ దెప్పిరిలుచున మోనమోర
ఘాత్తమాయ రామాయ లోకోత్తరాయ
యనుచు మ్రొక్కుచుఁ జిత్తంబునందుచుఁ దల
యూచుచు విచేష్ట గొంతసేపుండె సీత.

80. వసుధఁబుట్టితి దుఃఖానుభవముకొఱకె
లక్ష్మణా! నేను. మున్వానులఁగ రఘువరు
పాదములచెంతనుండుటం బ్రతికియుంటి
నయ్యనఘు వీడియెట్లుందునిఁక నడవిలోన.

81. ఇత్తఱిగంగానదిలో
నిత్తనువుఁ దొఱఁగుటయును గృత్యముగాదో
సత్తమ! శ్రీరామునిలో
కోత్తరవంశంబు క్షయమునొందును గానన్.

82. ఎవరికిఁ జెప్పకొందు సుఖమేనియు దుఃఖముఁ నేని నన్ను రా
ఘవుఁడు త్యజించివేయుటకుఁ గారణమెయ్యదియంచుఁ
దెల్పుదుగా
సవినయభక్తి నత్తలకు సమ్మతి మ్రొక్కితినంచుఁ
దెల్పు భూ
ధవునియనుజ్ఞ సేయుమికఁ బొమ్మ్మ. మదుత్తికఁ
బల్కుమా నృపుగా.

౮౩. వదలివేసితి వవయశోభయము వలన
ననఘ! యీగతినన్ను నట్టడవిలోన
ఎఱుఁగుదువు సీతబుద్ధియు హితమతియును
భక్తిభావంబు నిత్యంబు భావమందు.

౮౪. కాకుత్స్థాన్వయమందుఁబుట్టితి. యశఃకామంబు నీసొమ్ము. సు
శ్లోకుల్ మెచ్చెడి ధర్మనిష్ఠగలవీలోకాపవాదంబునన్
నీకాదూష్యతఁ బాపఁగాఁదగనోకో! నేనైన. లోకంబునన్
నీకన్నన్ గతి నాకు లేదసువు లేనిన్ నీకునై పాయుదున్.

౮౫. నాకపవాదము కల్గెను
నాకాయము నొచ్చెనంచు నాహృదయమునన్
నాకై నేఁ జింతిల. ధ
ర్మాకృతివై కీర్తిఁ గనఁగదయ్య రఘువరా!

౮౬. నావుడు లక్ష్మణుండు రఘునాయకపాదసమీప భూమికిన్
బోవుదు తల్లి! యంచుఁ గరముల్ ముకుళించి నమస్కరించి రెం
తో వనటన్ జనెన్. భయముతో జనకాత్మజ యేకదృష్టి నా
త్రోవనె చూచిచూచి వగతో మతిలేకెలుగెత్తి యేడిచెన్.

87. ఫలపుష్పాదులకై వటు
వులుగొందఱువచ్చి సీతపొక్కుట వాల్మీ
కులకుఁ దెలుపంగ వాల్మీ
కులు వచ్చిరి సీతయెడద గొందలమడఁగన్

88. వచ్చి యూఱడించి వనితను జానకీ!
జనకుబలెను నన్నుగనఁగదమ్మ
నీకుభయమువలదు నెలఁతరో! కష్టముల్
కాపురాలుసేయు కరణి గలదె?

89. పూర్వపాపఫలము పొలతిరో! దుఃఖమై
యెల్లజీవులఁదపియింపఁజేయు
పూర్వసుకృతఫలము నిర్వృతిఁ గలిగించు
దీనికై విచారమూనఁదగదు.

90. అస్మదీయాశ్రమపాత్రమందుఁ గొంద
ఱంగనామణుల్ సద్గోష్ఠియందభిరుచి
గలిగిశాంతిగాఁ గాలంబుగడపుకొనుచు
వాసమొనరించుచుందురు భక్తితోడ

91. స్త్రీల విద్యాలయములోనఁజేరి నీవు
చదువుకొనుచు సద్గోష్ఠితోడ దినములను
గడపుమమ్మ విజ్ఞానప్రకాశమొనఁగఁ
జ్ఞానమునకంటె మనకు ముఖ్యంబులేదు.

92. అనుచు నూఱటగలిగించి యవనిజాత
వెంటరాఁజని బహువిధ విద్యలందు
నారితేరిన సతుల విద్యావ్యసంగ
శబ్దమొసఁగు కలాశాలఁదఱిసిమాని.

93. జనకతనుజాత శ్రీరామచంద్రమూర్తి
యనుఁగుసతి మనయాశ్రమాభ్యంతరమున
కొంతకాలము వసియించు శాంతిఁగోరి
మీరలాశ్రయమొసఁగుఁడా మెలఁతకనియె

94. వారలందఱు స్నిగ్ధభావంబు గల్గు
కన్నులంగాగిలించి యక్కాంతనంతఁ
బ్రకటమగుచున్న బంధుభావంబుతోడ
నాదరించిరపూర్వసౌహార్దమొసఁగ.

95. గర్భవతియగు జానకీకాంతకచట
నమలమైన కాలక్షేపమగుచునుండె
నిష్ఠతోడ నుసత్కథాగోష్ఠితోడఁ
బుష్టితోడ నితాంతసంతుష్టితోడ.

96 కొన్నినెలలట్లు నడచెనకోమలి కటఁ
గలిగిరంతటఁ గవలపిల్లలొకనాఁడు
ఆదినంబుననే లవణాసుర విజ
యమునకేగుచు శత్రుఘ్నుఁ డచటవిడిసె.

97. ఆనువార్తను విని యతఁడధిక మోద
మేదురాంతరంగుఁడయ్యె మేలు! రఘు కు
లాంకురం బేర్పడియెననునట్టి వార్త
వీనులార నిన్నాళ్లకు వింటిననుచు.

98. దీనిచే నప్పుడపుడు పృథ్వీతనూజ
వార్త లయ్యయోధ్యాపురవర్తులకును
హెచ్చుగా నెప్పుడుఁ దెలియువచ్చుచుండె
ననుచు నూహింప నవకాశము దొరుకఁబడె

99. వీణమీఁదను లయసమన్వితముగాఁగఁ
బాడనేర్చిరి వాల్మీకితోడఁ జదివి
గేయముగనున్న యెల్లరామాయణమును
కుశలవుల్ కుశాగ్రనిశితకుశలమతులు.

100. అతిమహత్తరముగ రామునశ్వమేధ
మపుడగుచునుండె నయ్యయోధ్యాపురమున
అచటికేగి మదీయ రామాయణమును
బాడుఁడని కుశలవులను బంపె మౌని.

101. వారలిద్దఱయోధ్యకు వచ్చి సభలఁ
జత్వరంబుల నరవరాస్థానములను
సుమధురంబుగఁ బాడి సుశ్లోకులైరి
రంజిలెను రాముఁ డప్పాటరక్తివలన.

102. అంత వాల్మీకి రామభూకాంతుఁ డాసి
వీరు నీపుత్రులంచు వివిదపఱిచి
సీత నిర్దోషయనుచు వచించినంత
నరపతి సభనడుమఁ బ్రమాణంబుఁ గోరె.

103. పౌరలోకంబు మెప్పింపఁ బార్థివునను
మతిని బడయంగ రోసి భూసుత శిరమును
వంచుకొని తల్లిధరణిఁ బ్రార్థించె మదిని
భూమి వివరంబొసంగెను బుత్రికపుడు

104 నాటకంబులు లేవు రణములు లేవు
మూర్ఛలును లేవు పెక్కుడుపులును లేవు
గంగలోఁబడుటలు లేవు కాఱుకవుల
దింపుటలు లేవు వాల్మీకి దివ్యవాణి.

శ్రీరఘుకు లేశుఁ దప్పనాచిత్తమెఱుఁగ
దెవ్వరినటంచు వివరమ్ము నిమ్మనుసుత
దివ్యసింహాసనమున భూదేవి గూరు
చుండఁ బెట్టుకొంచుఁజనియె నింపు పేర్చు
శ్రీ తరుణిఁ బోలు సీత ర
సాతలమున కేగ సాధు! సాధు!“నమశ్శ్రీ
సీతా మైభూగ ర్భో
ద్భూతాయై” యనుచు జగము బొరనఁ బొగడెన్.
శ్రీ శ్రీ శ్రీ.

# రసము.

కావ్యనాటకాదుల నొకఁడు కథానాయకుఁడగుటయు వానికిఁగావలసినదొకటి వానియత్నములకు గుఱియై యుం డుటయు సంస్కృతవాఙ్మయమునఁ గలదు. కథానేతప్రకృతిని బట్టి కావలసిన ఫలము నిర్వహింపఁబడవలెను. కాన వాని స్థాయిభావము నొకదాని మొదటఁ బ్రకృతిగా సూచించి దానిని జావనీకుండఁ గథనడుపుటయు సంస్కృతపుస్తకములఁ గలదియే. కాబట్టి నాయకుని స్థాయిభావము (ప్రకృతి) బీజమనియు వానివాంఛితార్థము గార్యమనియు నాటకలక్షణ ములు చెప్పెడిని.

ఈబీజమునుబట్టియే నాయకుఁడెవఁడో రసమేదియో నిర్ధారణ యగుచుండును. ఇది యుత్సాహమైన వీరరసము కల్గు. నాయకుడు వీరుఁడగు. ఇది రతియైన నాయకుఁడు శృంగారనాయకుఁడగు. రసముశృంగారమగు. ఇది శోకమయిన రసము కరుణమగు. నాయకుఁడు దుఃఖియగు.

గ్రంథమంతటను ఫలము సిద్ధించు జాడలును తత్ప్రయత్నములును గ్రంథాభివృద్ధితోఁ దోఁచుచుండవలెను. బీజమద్యైకథాభాగములఁ బలురూపుల నభివర్ధమానమగు చుండియుఁ బాఠకులకు వినువుగల్గనుంటకై వృద్ధిక్షయములకును దృష్టతాఃష్టతలకును భాజనమగుచుండవలెను.

ఫలము లేని శోకపర్యవసాయికథలు ఇంగిలీషులోఁ గలుగటంజేసి యిప్పుడు దెల్గులోనికి దిగుచున్నవి. సంస్కృతమున లేవు. ఈసంప్రదాయమునకుఁ గరుణారస ముత్తరరామచరితమున్నదని ప్రధానముగు నను వారివాదమున భంగము కల్గును. శోకముస్థాయి. ఇదియు బీజమనవలె. దీనికి ఫలమేముండును? ఏది యారంభమనవలె. ఫలము లేనిచోఁ బ్రతిముఖసంధిలోని యత్నము దేనినిగూర్చి? నాయకుఁడు శోకియై వ్యసని కాఁడా?

శాకుంతలమృచ్ఛకటికాదులఁ గామము పురుషార్థము. మహావీరచరితము వేణీసంహారము అనర్ఘరాఘవము మున్నగువానిలో దుష్టసంహారమనెడి క్షాత్త్రధర్మము పురుషార్థము. ముద్రారాక్షసమనెడి నాటకములో రాజ్యమనెడి యర్థముగాని రాక్షస వశీకరణమనెడి యర్థముఁగాని మలయకేతుభేదమునర్థముగా నిదుష్టనందసంహారమును నర్థమునుగాని కవినిర్వహింపఁ జేసియుండె. ప్రబోధచంద్రోదయము మొదలైనవి మోక్షపురుషార్థప్రధానములును గలవు. ఏదో ఒక పురుషార్థమును సాధించుట పురుషున కావశ్యకమనియు దానిప్రయత్నములనిట్లు దృఢచిత్తుఁడయి నడచుకోవలెననియు జనులకు బోధించుటయుండే యీకావ్యనాటకాదుల కాంతాసమ్మితత్వము. ఈపురుషార్థము కార్యమనిచూపుచు దానితో నింకొక గొప్పలాభము ననుకోకుండలభించినదానిని జేర్చి

యద్భుతముగ నిర్వహణమును నాటకాదుల యంతములఁ జేయుఁడని నాటకలక్షణములు చెప్పెడిని. ఇట్టు లద్భుత ప్రమోదపూర్ణులై సామాజికులు లేక పాఠకులును బర్యవసానమున నొప్పుట వారికి శుభదాయకమని మానసతత్త్వ ప్రకృతిపరిశీలకులగు భారతీయకవులు విషాదాంతములుగ నాటకాలు గూర్పరైరి.

భోజనమునఁ దృప్తుఁడై సాధువు "అన్నదాతః! సుఖీభవ" అనవలెనని ధర్మశాస్త్రము కలదు. మహదాశీర్వచనమని సర్వకార్యాంతములఁగలదు ఇట్టి యాచారము తృప్తిఁజెందిన నిర్మలస్వాంతము మంచితలంపులు శుభఫలము నొసఁగునని తెల్పెడిని. చెడ్డతలంపులు నిర్మలమతులలోఁగల్గి హాని సేయునని శాపకథలు బోధించును. కాన నాటకదర్శనమున రసాబ్ధి నోలలాడి తన్మయులైన సహృదయుల స్వచ్ఛాంతఃకరణములు పర్యవసానమున శుభానుసంధానములతో నొప్పిన శుభకరములగుట, శుభభావనల భావికార్యాభినివేశములలోఁ గల్గించుటద్వారా కల్గవచ్చు. ఇది యసంభవముగ మానసపదార్థపరిశీలనసముద్వోపాంతరీయులకన్న మిన్నగ నెఱఁగినట్టి పతంజలివంటి మునులవంశములలోఁబుట్టినట్టి భారతీయుఁడు తలఁపఁగూడదు. కాన విషాదాంతములు వెనక నేర్పడలేదు.

ఉత్తరరామచరితనాటకములో కరుణరసమని కొందఱును ధర్మవీరరసమని కొందఱును కరుణవిప్రలంభమని మఱి కొందఱును వచించుచున్నారు. సీత చచ్చెనని శ్రీరాము

సకుఁ దెలిసియున్నచోఁ గరుణమనియు లోకాంతరమున
నున్నదని తెలిసినఁ గరుణవిప్రలంభమనియుఁ గరుణవాదు
లును శృంగారవాదులును రామునియేడ్పులలోని మాటలను
దమపక్షముల కనుగుణముగా నన్వయించుకొనుచున్నారు. కాని
కరుణరసమున్నయెడల దశరూపకకర్త ఘోషించెడి పంచ
సంధుల యన్వయము కుదురదేమో! కార్యమెయ్యది?
ఫలమెద్ది? శోకమునకు నోరెండుటతప్ప ఫలముండదుకదా.
ఇదిగాక ప్రతిముఖసంధిలో యత్నముండవలెను. ఇది యా
సంధిలోని యర్థావస్థయని లక్షణాలు కలవు. ఈయత్నము
కార్యమును గూర్చి యుండవలెను శోకపరిపాకమును గూర్చి
నాయకుడు యత్నింపఁడుగదా. శృంగారమున్న లోకాంతర
గతనాయికాప్రాప్తి కార్యమును అపత్యలాభముకాని శత్రు
ఘ్నుజయముకాని ఫలమును కావచ్చు. కాని నాయికాప్రా
ప్తికై రాముడు యత్నించినట్లు లేదు. ప్రతిముఖసంధి
యర్థావస్థయును కాలులేక కుంటుచు. కాన ధర్మవీరమును
కొనిన వీలుగాఁదోఁచెడిని. ప్రజారంజనమే కార్యము.
భార్యాపుత్రప్రాప్తి ఫలము. అష్టావక్రుఁడు వచ్చి చెప్పిన
యుపదేశము మొదలు బీజోపక్షేపాదుల నన్వయించును. దానికై
యత్నము రామునికి లేకపోలేదు. సీతాత్యాగశత్రుఘ్న
ప్రేషణాదులా యత్నములే, నాయికాప్రాప్తిఁగోరని రాముని
శృంగారనాయకుని జేయుటకంటెను, పామరత్వము రామున
కాపాదించు కరుణమును సాధించుకంటెను నాటకమున

ముఖ్యరసమునందుబడు వీరమునే ఉత్తరరామచరిత్రమున ముఖ్య మనుట యుక్తముగాందోచు. "ఏకోరసఃకరుణ" యని న్యాయముగానే చెప్పెనందురు. కాని యాత్రేయియుక్కుడమన్న పాత్రలలో దుఃఖమును నిమిత్తభేదమున భిన్నమనుచున్నది.

## సాదృశ్యభేదములు.

ద్విజేంద్రలాల్ రాయలు శాకుంతల ఉత్తరరామ చరిత్రనాటకములకుంగల సాదృశ్యభేదముల నిట్లు వర్ణించుచున్నాఁడు.

## సాదృశ్యము

1. రెండు నాటకములలోంగూడ రాజులపరిణయము వర్ణింపబడినది. 2 నాయికలు అమానుషీసంభవులుగ వర్ణింపం బడిరి. 3. ఏకారణమునవైననేమి నాయకులిద్దరును నాయికలను బరిత్యజించిరి. 4 పరిత్యక్తలయిన నాయికలు దైవశక్తి వలన తమ తమ మాతృమందిరములం జేర్పబడిరి. శకుంతల హేమకూటపర్వతమునను, సీత రసాతలమునను ఉండిరి. 5. వియోగము జరిగినపిమ్మట శకుంతలకును, సీతకునుగూడ సంతానము గలిగినది. ఆసంతానము ద్వారముననే నాయికా నాయకులకు పునస్సంగమము గలిగినది.

## భేదములు.

1. శాకుంతల నాయకుడు కాముకుడగు రాజు. ఉత్తర రామచరిత్ర నాయకుడు కర్తవ్యపరాయణుడగు రాజు.

2. శాకుంతలములోనివిషయము— ప్రేమయొక్క తొలుతటి యుద్వేగము. ఉత్తరరామచరిత్రలోని విషయము సుపరిచితమైన ప్రేమయొక్క గంభీరభావము.

4. కాళిదాసుని నాయకుడు అచిరకాలములో పరిణయమును విస్మరించును. భవభూతినాయకుడు చిరకాలమైనను నిరంతరము నాయికా స్మరణముతోనే కాలముపుచ్చును.

5. దుష్యంతుడు బహువల్లభుడు రాముడు ఏకపత్నీవ్రతుడు.

నాయికలు.

శకుంతల యువతి, తాపసి, ఉద్దామకామ, చంచల, అధీర. సీత ప్రౌఢ, రాజకుమారి, ధీర. శకుంతల గర్విత. సీత భయవిహ్వల. శకుంతల తపస్విని యైనను గృహస్థ. సీత గృహస్థయైనను ఒకవిధముగ వానప్రస్థ. శాకుంతలములోని నాయికానాయకులు కామినీకాముకులు. ఉత్తరరామచరిత్రలో నాయికానాయకులు దైవసంపత్తుచే విరాజిల్లుచున్న దేవీ దేవరయు.

కరుణరసము.

నైశసే.హింసాకృత్యమును జెప్పెడియీపదము కరుణరసమును, మరణమును గొప్పహింసను దీసికొనిన దెల్పు. సాధారణముగ నీపదమువాచ్యార్థము చంపుటయె యగు. క్రవ్యాదోభ్యఃబలిమివ. దారుణఃక్షిపామి సానికే గృహాశకుంతికామివ, మనోరథస్య. యద్బీజంతద్దైవేనాదితోహ్యాతంలతాయాం పూర్వ్యాలూనా

యాం ప్రసవస్యోద్భవః కుతః. కరుణస్య మూర్తిరివ. నిరవధిక యంతు ప్రవిలయః కరుణోర్మయః కరుణాంతరంచవిద్యతే. కరుణాద్భుతరసంచ. నాశిత ప్రియతమః.

ప్రణష్టమివనామాపి జగజ్జీర్ణారణ్యంభవతి హికళత్రేహఖ్యపరతే.

తస్యాస్త్వద్దుహితుస్తథావిశసనంకిందారుణే! మృష్యథాః.

త్వంకాలేసతథావిధోప్యపహృతః సంబంధబీజంచతత్.

కౌసల్య, హా! వత్సేకఇదానీంతే శరీరకుసుమస్య ఝటితి ద్రైవదుర్విలాసపరిణామపకాకిన్యావిపతితాసి.

పుటపాకప్రతీకాశో రామస్య కరుణోరసః

వీరరసము

1. ప్రసీదత. రుద్యతే. అతిగంభీరమాగూరణం మన్యోః. ఈశ్లోకము ప్రజారంజనధర్మము వదలరానిదను రామభావము ను వెల్లడించుచు శ్రీరాముని ధర్మవీరుని జేయుచున్నది.
2. ప్రకృష్టస్యైవధర్మస్య ప్రసాదో మూర్తిసుందరః.
3. యుక్తః ప్రజానామనురంజనేస్యాః తస్మాద్యశోయత్పరమంధనంవః.
4. ఇయం హిరఘుసింహానాం వీరచారిత్రపద్ధతిః
5. ఆరాధనాయలోకస్యముంచతో నాస్తిమేవ్యథా
6. సీతా, అతఏవ రాఘవధురంధర ఆర్యపుత్రః,

## కరుణవిప్రలంభము.

స్నేహార్ద్రాః. శోకదారుణాః.

ఈ స్నేహపదము నిరాశదుఃఖము కాదనియు, ఆశాసహితదుఃఖమనియుఁ దెల్పుచుఁ గరుణవిప్రలంభమును సాధించెను.

క్రవ్యాద్భిరంగలతికా నియతం విలుప్తా. నియతమితిసంభావనాయాం అనివాఖ్య ఉత్ప్రేక్షైక కోటిక సంశయమైన యీసంభావన (ఊహ) సీత బ్రతికియుండవచ్చు ననియునొకపక్షమును సూచించెడిని.

హృదయస్య విప్రలంభః విప్రవాస్యథేవ

ఏష తే కావ్యార్థః.

సీత లోకాంతరమున కేగినట్లు తెలిసికొని మూర్ఛిలిన వెంటనే యిట్లనుట కరుణవిప్రలంభమే యుత్తరరామ చరితమున ముఖ్యరసమని సూచించెను.

1. నకించిదపికుర్వాణః సౌఖ్యైర్దుఃఖాన్యపోహతి, తత్తస్యకిమపిద్రవ్యం యోహియస్య ప్రియోజనః.
2. సహిస్నేహాత్మకస్తంతు రంతర్మ్మాణి సీవ్యతి.
3. వినిశ్చేతుంశక్యోనసుఖమితివా.
4. జీవయన్నివ ససాధ్వసశ్రమస్వేదబిందురధికంఠమర్ప్యతాం తథాకారయుగ్మ సానందం.
5. సాంసారికేషు విషయేషు వయుంవసజ్ఞాః
6. హృదయంత్వేవ జానాతి ప్రీతియోగః పరస్పరం

7. దళతివజ్రం. గ్రావారోదితి.

8. తిరశ్చామాంతరాణి తత్త్వాన్యపస్నేహయతి

9. ఏహిజీవయమేవత్సం సౌమ్యస్పర్శేనపాణినా. లలాటేహృదయేచ స్పృశతి.

తమూపా భాష

ఈదృశ స్తే నిర్మాణభాగః. కఠోరగర్భా. ప్రత్యనంతరీభావః. నమోవాకం ప్రశాస్మహే. ఆత్మనః కలాం. ఉద్గీథవిదః. యుష్మత్ప్రసాదోపాదానఏషమహిమా. పరస్సహస్రాః. సభాజనోపస్థాయినః విపచ్యమానం.

ధర్మవీరము.

సాధకము.

మొదటనే అష్టావక్రు పరివేశము "యుక్తః ప్రజానామనురంజనేస్యాః" అను నుపదేశముచే బ్రజాపాలనోత్సాహము రామునిలో నెలకొల్పుటకనితోడ్పడెను. కాన బీజన్యాసాదులు ధర్మోత్సాహము బీజమనఁ గుదురు. ఆరంభయత్నములు ముఖప్రతిముఖసంధులందు" యదివాజానకీమపి" అనుమాటలచేతను"హంతదిఙ్మమథన్యాం,,అనుమాటలచేతను సీతాత్యాగశత్రుఘ్నప్రేషణాదులచేతను బ్రజాపాలనకార్యమునకు సరిపోవును తృతీయాంకమున సీతనుగూర్చి రామునిచింతమితిమీరెను గానను లవునిపద్యాలువినినప్పుడు సీతాధ్యానము ప్రబలెను గానను ఇట్టియితరసందర్భము లుండుటంజేసియుఁ బ్రతిముఖసంధిలోని బీజాలక్ష్యతయు గర్భసంధిలోని బీజ

నష్టతయుఁ బ్రాప్త్యాశయుఁ గుదురును. "క్రోధేనావమృశేద్యత్ర,, అను విమర్శసంధిలక్షణ సమన్వయము, చంద్రకేతుయుద్ధారభటివలనదోఁచు నశ్వమేధమను రాజధర్మము నిర్వహణమునను, శంబూకవధ మొనర్చి బ్రాహ్మణశిశువును బ్రతికించి రాముఁడు వచ్చెననుట చేతను సరిపోవును. నిర్వహణసంధిలో కార్యము ప్రజలు సీతకు నమస్కరించుచున్నారనుటందోఁచు. శత్రుఘ్నుఁడు శత్రుజయము చేసి వచ్చుట ఫలము. ప్రథమాంకమున సీతాత్యాగ శత్రుఘ్నప్రేషణాదులును, ద్వితీయాంకమున బ్రాహ్మణశిశురక్షణార్థః శంబూకవధమును, రాజధర్మశ్రవణార్థ శాగస్త్యోపసదనమును, తృతీయాంకమున నంతటిసీతచింతకల్గియుండియు సీతకై యత్నింపక యశ్వమేధ సంపూర్తి కేగెననుటయు, హిరణ్మయ సీతాప్రతికృతిని గ్రహణము చేసి యాగధర్మరతుఁడయ్యెననుటయుఁ జతుర్థాంకమునఁ "ప్రజాపాలకమాతుని:" అనుజనకోపాలంభమున రాముని ప్రజానురంజనరూపరాజధర్మశిద్ధసూచితమగుటయు "ఆత్మా వై పుత్రనామాసి" మన్నగు శ్రుతులచే రామరూపులనఁదగిన కుశలవులయందు పౌత్రధర్మదీక్షయే చూపఁబడుటయుఁ బంచమాంకమునఁ జంద్రకేతు సమాగమమున నశ్వమేధమును శ్రీరాము రాజధర్మము సూచింపఁబడుటయు షష్ఠాంకమున లవపరాక్రమము రామపౌత్రధర్మసూచకమగుటయు సప్తమాంకమున "పౌరజానపదా: ఆర్యాం నమస్కుర్వంతి,, యని ప్రజారంజనము పూర్తిసేయఁ బడుటయు ధర్మవీరమునకు సర్వాంకవ్యాప్తిని

సూచనలచేత నెక్కువగను ప్రదర్శనముచేతఁ గొంచెముగను సమర్థించుచున్నవి.

ధర్మవీరరసము.

బాధకములు.

ధర్మవీరరసమునకు సర్వాంక సంస్పర్శము పరిదర్శనసమూలమున లేదు. అంగమైన శోకమునకును సీతానురాగ ప్రదర్శనమునకును స్థానమెక్కువయియీఁబడినది. రాముని ధర్మోత్సాహము సూచన లచ్చటచ్చటఁగన్పట్టు. రాముఁడుదండకఁజూచినప్పుడును లవునిపద్యాలు. వినినప్పుడును లాతిసమయములందును రామునిశోకమో అనురాగమోగాని యుత్సాహముకన్పట్టుట లేదు.

కరుణము

సాధకములు.

1. "సర్వథా వ్యవహర్తవ్యం కుతోహ్యవచనీయతా,, అన్నాఁడు కాన

2. "ఏషకవివశాదారోధ్యక స్తదానీంతనశ్చసంవృత్తః,, అనుచో లక్షణాతిక్రమణము కన్పట్టును. దానంజేసి శృంగారవీరములనువదలి కరుణమునంగిగఁ జేసియుండుననుకోవచ్చు.

3. "ఏకోరసః కరుణఏవ,, అని నాటకపాత్రముఖమునఁ జెప్పించుఁగానను,

4. శ్రీరాముని సీతాస్మృతి నిశ్చయము కరుణరసవాక్యములచేఁగన్పట్టును గానను,

5. సర్వాంకసంస్పర్శము శోకముననే కన్పట్టుఁ గానను,
6. "ఏష తే కావ్యార్థః,, అని సీతాప్రాప్తికి ముందే శ్రీరామ దుఃఖపరిపాకమైన మూర్ఛయందన్నాఁడు కానను,
7. "రామస్య కరుణోరసః" ఇత్యాదులఁ గరుణపదము చాలసారులు వాడఁబడును గానను,
8. రాముని శోకము చాలక జనకకౌసల్యాదులశోకము బోషించుటకు జతుర్థాంకమున జనకాదులను వాల్మీకియాశ్రమమునకు రప్పించెఁగానను, గరుణరస మంగిగా సిద్ధించెడిని.

కరుణరసబాధకములు.

1. నాటకమున వీరశృంగారము లుండవలెను గానను,
2. ముఖసంధిలోని యారంభమును ప్రతిముఖసంధిలోని యత్నమును విమర్శసంధిలోని బీజార్థావమర్శమును గుదురవు కానను,
3. నిర్వహణములోఁ గార్యము గన్పట్టదు గానను,
4. విప్రలంభపదము రెండుసార్లు వాడెను గానను,
5. సీత మరల లభించెడినిగాన "అలభ్యే,, అనిన లాక్షణికుల మాట సరిపోదు కనుకను,
6. సీతాప్రాప్తితోఁ బూర్తియగుటచేఁ గరుణరసపర్యవసానము లేమిం జేసి సంభోగ శృంగారమే అంగి కావలసివచ్చును గానను,
7. "పుత్రిపూర్ణోత్సంగాం" ఇత్యాదులైన కొన్ని ఋషులదీవనల

చే రామునకు సీతాలాభసంభావన యున్నదనవచ్చును గాసను, కరుణమంగి కాఁజాలదు.

శృంగారసాధకములు.

1. విప్రలంభపదప్రయోగమునను,
2. సీత లభించెఁ గానను,
3. మూర్ఛఁబాపి బ్రతికించుటకు సీతాస్పర్శము నేసాధనముగాఁ జెప్పి రామునిశృంగారనాయకుని జేసెఁ గావునను'
4. నిర్వహణసంధిలోఁ గార్యము సీతాప్రాప్తియుఁ బుత్రలాభ శత్రుఘ్నజయాదికము ఫలమునుగావచ్చెఁ గానను,
5. ఋషులదీవనల చేసీతాలాభ సంభావనయుండవచ్చును గానను,
6. ,,నాశిత ప్రభృతి పద్యాలకును,, లతాయాం పూర్వలూనా యాం'' ఇత్యాదులకును సానికోపమానాదులకును ,,అని ష్టాశంకీనిబంధు హృదయాని,, అనుకొనుటచే సీతాలాభసంభావనానుకూలతఁ జెప్పవచ్చునుఁగానను,
7. శాకుంతలషష్ఠాంకదుష్యంత వచనములిట్టివి కలవు కానను,
8. శృంగార నీకములకుఁ బ్రాధాన్యము గల్పించి జేసి నాటకలక్షణముకుదురును గానను,
9. దండకారణ్యావస్థ దర్శనమున రామదుఃఖమును బెంచుట శృంగార పర్యవసాయి కావచ్చును గానను, కరుణవిప్ర లంభము త్తరరామచరిత్రమున సిద్ధించెడిని.

శృంగారబాధకములు.

1. సీతాప్రాప్తికొరకు యత్నము లేదు కానను,

2. కరుణరసపదప్రయోగమునను,
3. రతీదేవికి ఆకాశవాణి వలెను మహాశ్వేతకుఁ జంద్రాంతర్గత దేవతవలెను రామునకెవ్వరును సీతాలాభమునుగూర్చి చెప్పలేదు కానను,
4. సీత మృత యయ్యెననుకొనినట్లు సీతయుండెనోయను మాట యెపుడును లేదు కానను, కరుణవిప్రలంభశృంగారయుత్తరరామచరితమునవంగియునుట నమంజసము కామన్నది

,,కరుణోరసః ,, మొదలగు మాటలచేత రసనిర్ధారణ కాదు. కరుణరసప్రధానములుగాని పుస్తకములలోఁగూడ గరుణపదమెక్కువగఁ బ్రయోగింపఁ బడినది. రసము స్వవాచకములచేఁజెప్పఁ బడుటదోషము. ఆయారసములు ధ్వనించుసందర్భముల సాయాపదములుండుటయుఁ గలదు. అదియసువాదము. ఆశబ్దములచే రసము వాచ్యముకాదు.

కుమారసంభవములోని రతిశోకసందర్భమునను మన్మథ కాదంబరిలోని మహాశ్వేత శోకమునను పుండరీకులు లోకాంతరమున నుండిరని తెలిసికొని దుఃఖించుట కన్పట్టెడిని. అద్దానిని ప్రవాసశృంగారమనియే దశరూపకాదులు చెప్పెడి. కరుణవిప్రలంభమని సాహిత్య దర్పణాదులు చెప్పెడి. మన్మథపుండరీకులు లోకాంతరమున నుండిరని యెఱుఁగనపుడు రతిమహాశ్వేతలు దుఃఖించుట కరుణరసాధికమనునది నిర్వివాదాంశము. దుష్యంతుఁడు శాకుంతల షష్ఠాంకమున మేనకాబంధువులచేఁదీసికొనిపోఁబడినశకుంతల లోకాంతరమున

నెక్కడనో ఉండుననని నిశ్చయించుకొనియే యేమ్చును. దీనివలన నతఁడెన్ని నిరాశమాటలనుకొనినను, అది కరుణవిప్రలంభమో ప్రవాసవిప్రలంభమో అగును. ఉత్తరరామచరిత్రమున రాముని శోకము విలక్షణముగనున్నది. సీతయున్నదని కాని లేదని కాని రామునికొక నిశ్చయమున్నదనుకొనుటకువీలుకల్గకున్నది. నిరాశమాటలచే మృతినిశ్చయముపరిథమగ్రాహ్యమగుఁ గాని కరుణవిప్రలంభములంగూడ నిట్టిమాటలు కవులువాడుటచూచుచున్నాము సీతాలాభముతోఁ బర్యవసానమగుచున్నదికాన కరుణరసమైనను శృంగారాంగము కావలసినదే. ,,ఏకోరసఃకరుణఏవ,, సిద్ధింపదు. కాన ,,పునర్లభ్యే,. అను లక్షణము ననుసరించి కరుణవిప్రలంభమనుకోవచ్చుఁ గాని కార్యయత్నారంభములు సరిపోవు. కాన ధర్మవీరరసము గ యనుకొని శృంగారమంగమనుకొనఁదగు.

ఉత్తరరామచరితలో ధర్మవీరమునకు సర్వాంకస్పర్శము.

౧ వ అంకము.

అష్టావక్రుఁడుపదేశించినదియు "యదివాజానకీమపి" అని శ్రీరాముఁడు ప్రతిజ్ఞచేసినదియు, "యత్సావిత్రైర్దీపితం" అనుచో రాముఁడు నిర్ధారణచేసినదియు, ప్రజానురంజనధర్మమే. శత్రుఘ్నప్రేషణము ప్రజానురంజకమగుటకే ,,లవణత్రాసితస్తోమః=ఉపస్థితః అనెను.

౨ వ అంకము.

దండకారణ్యయాత్ర బ్రాహ్మణశిశువును బ్రతికించు

టకే కాన శ్రీరామునిలో ప్రాతిధర్మోత్సాహమే ప్రాధ కల్పెడిని.

## ౩ వ అంకము.

దండకారణ్యమును జూచినప్పుడు సీతప్రేమ మిగుల బాధను కలుగఁజేసినను ప్రజానురంజనపరుఁడై సీతాలాభమునకుయత్నింపలేదనుటచే భర్తృధర్మోత్సాహమును వెనుకపడవేయఁగలిగిన ప్రాతిధర్మోత్సాహము శ్రీరామునందు వ్యక్తమగుచున్నది. భర్తృధర్మోత్సాహము దారేషణాదోషమునకు దాపునఁగలదుగాన దానితిరస్కారము "తస్మాద్యశో యత్పరమంధనం" అను గుహూపదేశమూలమున రామునకు నచ్చినది. సీతాశోకము ధర్మోత్సాహమునే బలపఱుచుచున్నది. ఏలయన- అంత రక్తుఁడయ్యు రాముఁడు సీతకై యత్నింపలేదు. ఎంతటి ధర్మదీక్షావేశమో! అనిపించెడినిగదా. విరక్తుని దారత్యాగమిట్లు భావాంతరమును (ధర్మోత్సాహమును] బలపఱుపదు. ఆతనికది సహజము.

## ౪ వ అంకము

జనకాదులఁగాంచి మోమోటమునను సిగ్గునను పశ్చాత్తాపమునను శోకవ్యాకులుఁడగుచుఁగూడ సీతప్రాప్తికి శ్రీరాముఁడుద్యమము నొనర్పకపోయెననుట ధర్మోత్సాహప్రాబల్యము నయ్యనఘునిలో సూచించుటలేదా?

## ౫ వ అంకము.

చంద్రకేతువు హయరక్షకై వచ్చెననుట శ్రీరాముని యశ్వ

మేధమను క్షాత్రధర్మమును దెల్పెడిని.

౬ వ అంకము.

బ్రాహ్మణశిశురక్షణయాత్ర చేసి రాముఁడు వచ్చుచు యుద్ధసన్నద్ధులయిన లవచంద్రకేతువుల మాన్పుచున్నాఁడు. ఇదియు క్షాత్రధర్మము.

౭ వ అంకము.

పౌరజానపదులు నమస్కరించుచున్నారని వినియే శ్రీరాముఁడు సీతను జేకొనెను. దీనిచేతను లోకారాధనోత్సాహమే రామునిలో లాతిభావములఁ దిరస్కరించుచు స్థాయియగుచున్నది. విరుద్ధమయిన శోకమును మిక్కిలి పోషించి దానిని బాధింపఁగలిగిన మహోత్సాహమును బ్రచ్ఛన్నముగఁ గడుంగడు బలపఱిచి సర్వాంకములలో భవభూతి ధ్వనింపఁజేసెఁగావున నుత్తరరామచరితలో ధర్మవీర రసమంగిగఁదోఁచెడి. , „వివక్షితే రసేలబ్ధప్రతిష్ఠేతు విరోధినాం. బాధ్యానామంగభావంవా ప్రాప్తానాముక్తిరచ్ఛలా.„

అని యానందవర్ధనుఁడు.



# అభిజ్ఞానశాకుంతలము.



"కనిష్ఠికాధిష్ఠితకాళిదాసా,,



మహాకవి కాళిదాసుఁ డీనాటకమందుఁ దాను సాధింపఁ దలఁచుకొనిన శృంగారరసమును సముచితమై విచ్ఛేదము నందకుండ సిద్ధింపఁ జేసికొనుచుఁ బాత్రములకును బ్రసంగములకును సమగ్రమైన యౌచిత్యమును సంపాదించుకొనుచు నపేక్షితములుగాని వర్ణనలకుఁ బ్రసక్తినిడక కథాసంవిధానశిల్పసాంద గ్రగణ్యుఁడై, రసికసంతతికి స్పృహణీయమహిముఁడయ్యెను.

## రసము.

హాస్యభయానకశాంతాది రసములకును, వాత్సల్యము భక్తి మున్నగు భావములకు నచ్చటచ్చటఁ దగురీతిఁ బ్రవేశ మొసంగినను మహాకవివర్యుని యవిచ్ఛిన్నప్రతిభాధారకు గోచరమై ధారావాహిగా నాటకమందాద్యంతవ్యాపియైనది శృంగారమే. వీరరసమో శృంగారరసమో నాటకమునందుఁ బ్రధానరసమై యుండితీరవలయునను లాక్షణికసాంప్రదాయ నియమము సైతము, మనశాకుంతలమువంటి లలితరచనల యందు శృంగారమునకును, అనర్ఘరాఘవమహావీరచరితముల

వంటి యుద్ధతరచనలయందు వీరరసమునకును, వస్తుసౌందర్యజ్ఞు లయిన మహాకవికాళిదాసాదు లిట్టి ప్రాధాన్యము నొసంగం బట్టియే యేర్పడెను.

ఆశృంగారము సహిత యొక్క విధముగాఁ బోషింపఁబడిన సహృదయహృదయములకు వినువుపుడవుమనోకో యని ప్రయోగనూత్నజ్ఞుడగు మహాకవి ప్రథమాఙ్కమందుఁ బూర్వరాగవిప్రలంభశృంగారమును (అనగా నాయకానాయకులకుఁ బ్రథమమందుఁ గలిగెడి యనురాగముయొక్క నూతనావస్థ) బోషించి యంతట ద్వితీయాఙ్కమునయ్యది యెన్నర్యమాణ మధురమగు లాగునఁ బ్రయోగించె. పిదపఁ దృతీయాఙ్కమున సంభోగ శృంగారరసమయమయిన భావసామగ్రిని వ్యక్తముఁజేసె. చతుర్థాఙ్కమున రసిక హృదయముల సులభముగఁ దన్మయముఁ జేయుఁజాలు వాత్సల్యమును కణ్వమహర్షి యందును శకుంతలయందును ఒకచో వననేలని కణ్వాశ్రమము దెల్లెడను సహజ శాంతివ్యాసారమునకు సహిత మొలపిడి కలుగునట్లు వెల్లివిరియఁజేయుచు తత్తాదృశమయి సీమాతిగామియగు నమ్మహావాత్సల్య ప్రవాహమునకు సేతువై నిలిచి శృంగారరసమే నాటకమందుఁ బ్రధాననాయికయగు శకుంతల యొక్క పతిగృహయాత్రకు నిర్విఘ్నమొనఁగూర్చెనని వ్యక్తపఱిచి తనప్రధానరసపోషణమందలిజాగరూకతను వెల్లడించె.

పంచమాఙ్కమున, దైవానుకూల్యము లేక రసకార్యముఁ లకుఁ బ్రతిబంధ మొదవినను నాయికానాయకుల యంత

రంగముల స్నిగ్ధతను బలపఱుచు తిరముగఁ భావప్రతిష్ఠ దొలఁ గింప శక్యముకాదని దుష్యంతునియొక్కయు శకుంతలయొక్కయు సకలభాషణములయందు సూచించుచుఁ బ్రస్తుతమగు ప్రధానరసరాజమున కవిచ్ఛిత్తిని నెలకొల్పఁగొనెను.

షష్ఠాంకమునఁ దనకుఁ బలువిధముల నభీష్టమయినదియు మేఘసందేశ మహాకావ్యమహారాజ్యము నేకచ్ఛత్రముగా నేలుచున్నదియు నగు ప్రవాసవిప్రలంభశృంగారమును (నాయికానాయకులు దూరస్థులై పరస్పరవియోగములఁ దహతహపడుచుండుట)సస్వభావస్మరణకుఁ దెచ్చుచుండ శృంగారసారసర్వమును వివిధములగు పాత్రముల ముఖమునఁ బరిస్ఫురింపఁ జేసెను.

సప్తమాఙ్కమునఁ బూర్వవర్ణితములగు బహువిధములైన శృంగారరసమందలి యవాంతరావస్థల కెల్లఁ బరమావధియనందగి ఫలభూతమయిన సంభోగశృంగారరససమగ్రితను సువిశుద్ధప్రణయరసభరితులగు నాయికానాయకుల యాకస్మికసమాగమమున నద్భుతరసముతోఁ గూడఁ బ్రదర్శింపఁబోవుచుండెను. అందుఁ జిత్రముగఁ బ్రప్రథమమున, శాస్త్రీయమగు సంతతి విచ్ఛేదదోషముఁ దలఁచుకొని పశ్చాత్తప్తుఁడగుచున్న దుష్యంతుని సిగ్ధహృదయమున ఔరసపుత్రుని గాఢాలింగమువలని సౌఖ్యము నొదవించె. ఇచ్చట కవిహృదయ మగాధము. నిరపరాధయగు సతీమణి సౌశీల్యమందన్యథాభావముఁ గల్పించి పూర్వమొనరించిన శాస్త్రీయగాంధర్వవివాహముయొక్క

వృత్తాంతమును మఱపించిన మునిశాపప్రభూతమగు తమస్సు నణచు,దదనంతరమతి వేలమయి పశ్చాత్తాపమిశ్రమయిన విరహాగవేదనానుభవమువలని కాలుష్యమునకును నిష్కృతిగాం బావనమయి యగాధమగు పుత్రవాత్సల్యమను దివ్యగంగాప్రవాహమునం గథానాయకుని హృదయము నొకపఱి మనమహాకవి తీర్థమాడింపం దలంచి ముంచునని పదంపడి సువిశుద్ధప్రేమవల్లికలు మొలకలెత్తి యేకాకారములుం స్వయనురూపదంపతుల హృదయదేశమున గంగాయమునాసరస్వతులకుం బలె నవనవవాత్సల్యానుశోకములైన యనురాగములకు సంగము ఘటిల్లంజేయుచు నిపుణముగ నిర్వహణసంధియందుం గథ నుపసంహరించెను. సత్యముగ నిట్టి సముచితరససంపాదన ధోరణి యనితరసాధారణమయి యనన్యాదృశమైన యతిశయమున రాజిల్లుచున్నది.

## ధ్వని

కావ్యకర్తలెల్లరు నొక్కొక్కవిధమున నొక్కొక్కరు దమకబ్బముల కందము దేఱం బ్రయత్నించుచునే యుందురు. కొందఱు శబ్దాలంకారములచేం గావ్యముల ఘనత నిల్పుకొందురు. కొందఱర్థాలంకారములం గుప్పి మైపని సాధింతురు. కొందఱు శబ్దశక్తిమూలధ్వనులు నింపి పద్యముల శోభ పోషింతురు. మఱికొందఱర్థశక్తిమూలములై యనురణనాత్మకములైన వస్త్వలంకారధ్వనులతోం గావ్యార్థమందలి యుదారతను సమగ్రము సేతురు. ఈ విమలశిరోమణులగు మనమహాకవికాళి

దానునివంటివారు కేవలమునంలక్ష్యక్రమవ్యంగ్యసరణిని దృష్టి నిల్పిభావాధ్వములవిస్పష్టముగవిహరించుచుఁబిపీలికాదిబ్రహ్మ పర్యంతముగల సకలప్రాణికోటుల హృదయరంగములయందు నుఁబరమేశ్వర కళావిలాసముగ సర్వకాలసర్వావస్థలయందును దేశపరిచ్ఛేదము లేక యేకాకారముతోఁ దాండవము సల్పు చుండెడి యఖండ బ్రహ్మానందరససమూర్తియొక్క యవతా రము లనఁదగిన నవరసముల మహాసామ్రాజ్యమునం దగ్రాస నము నధివసించి యానందామృతధారాపానమత్తంబులయిన చిత్తంబుల పారవశ్యంబు నవలోకించుచు ప్రణయగీతంబులొనర్చు చులోకంబును దన్మయత్వంబు నందించుచుందురు.

వ్యాసుని శకున్తలకును కాళిదాసునిశకున్తలకును జాల భేదము గన్పట్టెడిని. వ్యాసభట్టారకుఁడు తన పురాణముల యందెల్లయెడలను స్త్రీపురుషులకుఁ బ్రత్యేకము ధర్మాను ష్ఠానతత్పరత్వమును బోధసేయఁదలఁచి స్త్రీపుంసపాత్ర ములయందుఁ జమత్కారముల జోక్యమేమియు లేకుండఁ గేవల ధర్మపరాయణతను మాత్రమే ప్రదర్శించి యౌచి త్యమును దఱుచు సమర్థించుచుండును.

పురాణములు మిత్రసమ్మితములు. మిత్రుని సేమము గోరెడు బుద్ధిశాలి తన మాటవిని బాగుపడఁగల వినీతుఁ డైన మిత్రునకే యొకటి రెండు పర్యాయములు చెప్పవలసిన మాటలు చెప్పి బాగుసేయనెంచును కాని విననివానికిఁ జెప్పఁ బోఁడుగదా. ఆరీతిగనే స్వయముగ జిజ్ఞాసువులై విన నేర్చి

గురుకులమున శిక్షనందుచు గురుశుశ్రూషా రసాయనపాన
పరవశుఁడై లోకము మఱచు నైష్ఠికబ్రహ్మచారివడువున
నుండెను.

ఆ పతిదేవత హృదయమునఁ దన మనోహరుని చెంతకే
గవలెననెడి యౌత్సుక్యము కామోపబృంహితమై మహర్షివ
రేణ్యుని పాదసేవయందలి యభిరుచినిఁ గ్రిందుసేయుఁ గలిగి
నంతగ నుదయించియుండలేదు ఒకప్పుడైన స్వయముగఁగాని
పరుల ముఖమునఁగాని అట్టి యుత్కంఠతను సూచించినట్లు
లేదు. ఈరీతిగఁ దనకొడుకు పదిరెండేండ్ల ప్రాయమువాఁడగు
దాక కణ్వాశ్రమముననే శకుంతల కాలముఁ గడుపుచుండె
నట.

ఇచ్చట వ్యాసభట్టారకుని యాశయమేమి? ధర్మశ్రద్ధ
యందును లోతిసద్గుణసంపత్తియందును గొదువగలుగకుండఁ
జారిత్రమునుఁ బోషించుకొనుటయే ఆయనకుఁ గావలసినపని.
కాని భర్తమాటఁ దలంపక యింతకాలము పామరత్వముతోఁ
దండ్రికడ దర్భకూర్చలుగట్టుచుఁ బ్రత్తివిడులు దీయుచుఁ గాల
క్షేపము సేయుచున్న కతమున శకున్తల కనాగరకత్వము
చేర్పఁబడినదగునని కాని, విదగ్ధత, రతిపారవశ్యము, కామిని
ప్రాయఁపు గోవములుమున్న గునవిశేష శకున్తల సోమిదేవమ్మ
వంటిదగునని కాని వ్యాసమునీశునకు దిగులిసుమంతయుఁ
గల్గలేదు.

కాళిదాసమహాకవి కన్ననో అట్లుకాదు. ఈయన కాంతాసమ్మితములగు కావ్యముల నిర్మాణములో దిగి నాటకమును రచించుచుండెను ఇది వెనుకఁజెప్పఁబడిన పురాణ శ్రవణార్హులగు సంస్కృతబుద్ధుల కేర్పడిన బోధపద్ధతి కాదు. సుకుమారమతులకు అనగా రజోగుణమునకును వశులై చంచలములగు చిత్తవృత్తులతోఁ జమత్కారప్రియులై యుండు వారికి యుక్తాయుక్తబోధమున కవకాశము గలుగుఁ గాత మని సర్వేశ్వరుఁడు చూపించినమార్గము. ఇట్టిరీతి పాత్రముల లోఁజిన్నెలును వన్నెలును గావలయును. లేనిచో జిజ్ఞాసువులుకాని వారిచూపులనుఁ దమపైకి లాగికొనలేవు. సుళువుగా మందుదినక మారాముఁజేయు పిల్లవానికి బెల్లము మాటుపెట్టి ఘౌషధమునుఁ జొప్పించినట్లు, రుచిగల్పించి ధర్మసూత్రములు వీరి తలల కెక్కించవలసిన బాధ్యత కాంతాసమ్మితములగు కావ్యముల కున్నది. ఇందు ధర్మము ప్రధానముగఁ జెప్పఁబడి నట్లుండరాదు. ఏవో చమత్కారములు వలురకములుగ రసభావాది ప్రయుక్తములై గుణాలంకారాదివరిష్కృతములై కనఁబట్టుచుండవలెను. ఎటులైన సహజముగ ధర్మాభిరుచి లేక శ్రేయోమార్గపరాఙ్ముఖులగుచుండువారి కందములును చందములును చూపించి చెప్పీచెప్పనట్లు ప్రియముగా ధర్మము బోధించుచుండవలయును. కాంత తనయభీష్టము నిదమిద్ధమని చెప్పకయే సూచనలతో ప్రియుని మనసు గఱఁగించి సుళువుగ బనులెల్లఁ జేయించును. ఇట్టిపనికి

గ్రంథములయందుఁ బ్రధానముగ నేమి కావలెను? పండిత పామర సాధారణముగా సకలప్రజలకే కాక పిపీలికాది బ్రహ్మపర్యంతముగల సకల జీవకోటికిని దత్తదవసరములయం దంతరంగముల నార్ద్రములుగఁ జేసి యమందానందంబునం దోలలాడింపఁ జాలినదియు వాగ్రూపములయిన యంచెల మీఁదుగ విభావానుభావసంచారిభావనుయమై యొకరిహృద యమునుండి యొకరిహృదయములోనికిఁ బ్రాంగుచు సహృదయ హృదయసీమలలో వెల్లువలు పారుచుండునదియు నగు రసమునే చిప్పిలఁ జేయవలె.

అట్లు రసము చిప్పిలిననాఁడే గ్రంథరాజములు శ్రోత లనుఁ బాఠకులను విరివిగసంపాదించుకొనఁగలవు అప్పుడే సరస్వతి వినువారి కర్ణశష్కులికలలోఁ గుంపఁ దిగి భావవీధు లలోఁ బ్రవహింపఁ గలదు. అప్పుడే వాణీవిముఖులనైన డాసి యవిద్యానిద్రనుండి మేలుకొల్పఁ గలదు. అప్పుడే భాష శంఖ ధ్వనియై యజ్ఞానజాడ్యము తుప్పుదూలి పోవ ఘోషింప గలదు.

కావున కావ్యనాటకరచనాభిముఖులగు కవులెల్ల రును యథాతథముగ రససిద్ధికై పాటుపడక తప్పదు. దానం జేసి పాత్రౌచిత్యములు చిన్నెలు వన్నెలు గలిగి యుండ వలయును.

అదికారణముగ మహాకవి శకుంతల రూపరేఖలను భావరేఖలతోఁగూర్చి వ్యాసుని ప్రదర్శనమునకు భిన్నముగ నుండునటుల మార్పఁజొచ్చెను.

ఈమహాకవి రసమయుఁడైనట్టియుఁ, అందును శృంగార రసప్రధానమైనట్టి శాకుంతలనాటకముచే ధర్మబోధసేయఁ బ్రయత్నించుచున్నవాఁడు. కాబట్టి పురాణమున దొరకిన శకున్తలయొక్క గుణసంపత్తిచే సంతోషించి యాలలనామణిని ఆపరమపావనుఁ కాళిదాసు నాటకమునకుఁ గథానాయికాస్థానమందుంచి యాసాధ్వీమణియొక్క వినీతత్వమును కలంకాముగ వనితలతిపూలతికల [illegible] సంభృతమణ్డనమయినట్టియుఁ బుష్పవ్రతికెత్తునగు కామాస్త్రినంగాఁ దాను ముచ్చటపడుచుండునట్టియు సాధారణముగ నాగరికతగల యువతీరత్నములయందు మాత్రమే పొడకట్టుచుండునట్టియు మనోజ్ఞమగు రసభావబంధురత్వమును సహితము పొందుపఱిచి రసికజనస్పృహణీయమగు వైదగ్ధ్యకలావిలాససంపత్తితోడను స్నిగ్ధతావిశేషము చేతను భూషితమైన యానాయిక నీయభిజ్ఞానశాకున్తల నాటకమందు దుష్యంతనిష్ఠమగు రసభావసంపత్తికాలంబన విభావముగ నొనరించి రసమునకుఁ గొదువ లేకుండ నాటక శోభకుఁ గళ గల్గించెను.

ఇట్టి తనయుద్దేశము నెఱవేర్చుటకే, కొమరునకుఁ బదిరెండేండ్లప్రాయము వచ్చుదాక భర్త్రసాన్నిధ్యమునుఁ గోరక ఋష్యాశ్రమమునందే శకుంతల గాలక్షేపము సేయుచుండెనను పురాణకథను మార్చి గర్భిణిగనుండి నప్పుడే శకుంతల నత్తవారింటికంపుచుఁ బ్రణయిజన విరహదోధూయమానమానసయై కామాయత్తహృదయయగు శకుంతలను

దుర్వాసుని ప్రసంగముచే మనకుఁజూపెను. చతుర్థాంకమునఁ ప్రదర్శింపఁబడిన నిర్వేలవాత్సల్యమును నిరుపమానస్నేహమును నిర్నిద్రభక్తిభావమును మించి ముందంజవేయుచున్న శృంగారరసస్థాయియగు రతిని భర్తృగృహప్రయాణోన్ముఖతచే వెల్లడియగుచున్న ప్రాణప్రియదర్శనోత్కంఠాపారవశ్యముచేఁ గడుఁగడుఁ బరిపుష్టిగ సూచించెను.

ఇవ్విధమున రసభావ పరంపరలచేఁ గ్రిక్కిరిసి శోభిల్లుచున్న నాటకకథానాయికను ప్రియదర్శనలాలసను శృంగారమునకుఁ బతిపజ్జకుఁ బయనముచేసి "కంఠాశ్లేష ప్రణయిని జనేకింపున ర్ధూరసంస్థే" అనెడి రసిక సంప్రదాయమునకు భంగము గల్గకుండ రసపతుపాత్రప్రకారమునుఁ గావ్యస్రష్టల కెల్లఱకు నేర్పినవాఁడయ్యెను.

ఇట్టిభిన్నములగు గమనికలేవ్యాసకాళిదాసుల రచనలయందు శకుంతలాదుష్యంతుల వివాహసందర్భమునసైతముఁ గన్పట్టెడిని. వ్యాసుఁడు గాళిదాసునివలె వనజ్యోత్స్నమున్నగు లతామాలికలను బాలసహకారము మొదలగు తరుణతరువరనికరములను లతాశ్లేషభూషితములగు పాదపప్రకాండములను సృజించి యట్టిరమణీయారామమధ్యప్రదేశంబున భావపోషణసేయ నేర్చియున్న యనసూయా ప్రియంవదలతోఁగూడ శకుంతలను దుష్యంతునకుఁ బ్రథమముననె జూపించియుండలేదు. మఱియును హావభావములును సర్వోన్నత్తులును వ్యంగ్యధోరణులును శకుంతలయొక్క హృద

యరంగమునఁ గాని వేషభాషలయందుఁ గాని కాళిదాస
కవివలె వ్యాసముని యుద్భవింపఁ జేసి యుండలేదు. వ్యాసరచ
నయందు ప్రథమదర్శనమందే శకుంతలాదుష్యంతు లిరువు
రును ఎదుటఁబడి మాటలాడుకొనిరి. దుష్యంతుడు మొదటఁ
దనయభిప్రాయముఁ దెలిపెను. శకుంతల కులశీలాభిజాత్యాదు
లాలోచించి సమ్మతించి కణ్వునిరాక నిరీక్షించెదమనెను.
వారియాజ్ఞ లేకుండ నేనేమి సేయుటకును స్వతంత్రురాలను
గానని శాస్త్రయుక్తులతో ధర్మము నిర్ణయించి పలికెను.
దుష్యంతుడు పెక్కొన్ని ధర్మసూత్రములు బోధించి కణ్వ
నిపరోక్షమందయినను దమ గాంధర్వవివాహము శాస్త్రీ
యము కాకపోదని సిద్ధాంతముఁ జేసెను. అంతట ధర్మబద్ధు
రాలగు శకుంతల క్షత్రియుల కనింద్యమగు నవ్వివాహమున
కియ్యకొనెను. పదంపడి తనతో వచ్చిన పురోహితుండు
యాజ్ఞికుఁడుగా నగ్నిప్రతిష్ట చేసి విధ్యుక్తముగా గాంధర్వ
వివాహవిధానముచే సంస్కృతులై వారిరువురు నయ్యాశ్ర
మమునఁ గొంతకాలము దాంపత్యసౌఖ్యము లనుభవించుచుఁ
గాలక్షేపముఁ జేసిరి. అంతఁబని గలిగి దుష్యంతుఁ డింటి
కేగవలసినవాఁడయ్యెను. అంతఁబుత్రోత్పత్తియయ్యె. ఆత
డింటికిఁ జేరి రాచఱికపు రాచరికపు రాజసముచేత మునికన్యను
బత్నిగా నిలుపవలసి వచ్చునని యామెను రక్షించుకొనుటనే
మానుకొనెను.

ఇట్టి యథార్థస్థితిలోఁ గాళిదాసుఁ డెన్ని చిత్రములు పన్నెనో చూడుఁడు. ఒక తేఁదోటయు దానియందుఁ జెలులతోఁగూడి శకుంతల ముద్దులొలుకు గున్నపాదపములకు నీరొనగుచుంటయుఁ దత్కాలమున దుష్యంతుఁడు సన్నిహితుఁడగుటయుఁ దద్రసోచితములుగ సాకూతశృంగారచేష్టలును నర్మభాషణములును వ్యంగ్యసల్లాపములును జరుగుటయు ననునిట్టి వెన్నో వింతలు గల్పించెను. ఇట్టి భాగములు భారతమందీ సందర్భమునఁ గలవా?

---

# మీఁగడ తఱకలు.

(కాళిదాసః కవిశ్రేష్ఠః.)

ఇతః ప్రత్యాదేశా త్స్వజన మనుగంతుం వ్యవసితా
ముహు స్తిష్ఠే త్యుచ్చై ర్వదతి గురుశిష్యే గురుసమే;
పునర్దృష్టిం బాష్పప్రసరకలుషా మర్పితవతీ
మయి క్రూరే య త్తత్సవిషమివ శల్యం దహతి మామ్.

ఈశ్లోకమున మహాకవిగారి భావపోషణనైపుణి కన్నతెఱచి ని. దుష్యంతునియందు శకుంతలాని మోహాగజన్యమైన శోకమును సాధించుచున్నాఁడు. ఏది స్మృతికి వచ్చుటచేత ఈశ్లోకము అపారమగునో అట్టిదానిని దుష్యంతుని స్మృతిపథమునఁ బెట్టవలెను. తాను త్యజించి వెళ్ళఁగొట్టినప్పుడు శకుంతల

కణ్వశిష్యులతోడను, గౌతమితోడను పోఁబోయినది. కణ్వుని తర్వాత కణ్వునంతవాఁ డాశిష్యుఁడు, "నిలు" అని యదల్చి నాఁడు. అప్పు డామె మరలఁ గన్నీరు గార్చుచుఁ దన్నుఁ జూచినదఁట. ఈపరిస్థితిలో శకుంతల యీచేష్ట విషముతోఁగూడిన బాణాగ్రమువలె బాధించుటయం దబ్బురము కన్పట్టక పోఁగా, దుష్యంతుని దుఃఖము పరిమితి లేనిదని మనమునన్ను లకుఁ దోఁచుచున్నది. ఇట్లు శోకపోషకమైన చేష్ట కవికిఁ దోఁచుటయే మహాకవి లక్షణము.

పాతుం న ప్రథమం వ్యవస్యతి జలం
యుష్మా స్వపీతేషు యా
నాదత్తే ప్రియమండనాపి భవతాం
స్నేహేన యా పల్లవమ్;
ఆద్యే వః కుసుమప్రసూతిసమయే
యస్యా భవ త్యుత్సవః
సేయం యాతి శకున్తలా పతిగృహం
సర్వై రనుజ్ఞాయతామ్.

ఈశ్లోకములోఁ గణ్వునియందు శోకమును శకుంతలా వియోగముచే సాధించుచున్నాఁడు. శకుంతలమీఁది వాత్సల్య మీశోకమునకు హేతువు. ఆవాత్సల్య మెక్కువగుటకు శకుంతల ప్రేమించెడి వస్తువులును. ఆమె ప్రేమాతిశయము సూచించు చెయ్వులును కణ్వుని స్మృతికి దాకవలెను. అం దెట్టివేఁ తలు ఆఁడుపిల్లలకు సహజములై, సౌశీల్యసూచకములై, తల్లి

దంద్రులకుఁ గూఁతుల నత్తవారింటికిఁ బంపునప్పుడు స్మృతికి వచ్చి శోకమును బెంచునో, ఎవ్వి యాశ్రమవాసుల కుచితములో, అవి కాళిదాసమహాకవిగారికిఁ దోఁచుటయే రసభావపోషణచాతుర్యమును దెల్పుచున్నది.

ఔత్సుక్యమాత్ర మవసాయయతి ప్రతిష్ఠా
క్లిశ్నాతి లబ్ధపరిపాలనవృత్తి రేవమ్;
నాతిశ్రమాపనయనాయ నచ శ్రమాయ
రాజ్యం స్వహస్త ధృతదణ్డమి వాతపత్రమ్.

ఇట్టి శ్లోకములలో మానవప్రకృతి పరిశోధన నైపుణ్యము కవియందుఁ గన్పట్టుచున్నది గొప్పగొప్ప పదవులను నరులు గోరుదురు. అవి లభించిన పిమ్మట వారికి పరిలేనివారికుండెడి నిశ్చింత యుండదు అయినను మానవుఁ డాపదవిని వదలవేఁడు. అప్పు డానరుఁ డెద్దానిఁ జూచికొని యానందపడుచున్నాఁడు ? గొప్పను ఆపదవియందున్నఁ దన్ను గౌరవించు జను లుందురు. వారిమెప్పే యీతని పురుషార్థము. అట్టి లోకులలోఁ బేరుప్రతిష్ఠలు గలిగియుంటయందే ఆతని హృదయము రమించుచుండును. ఇట్టి స్వభావమును ,,ఔత్సుక్యమాత్ర మవసాయయతి ప్రతిష్ఠా,, అనుమాటచే మన కద్దమునఁ జూపినట్లు మహాకవి చూపుచున్నాఁడు.

శుశ్రూష స్వ గురూన్ కురు ప్రియసఖీ
వృత్తిం సపత్నీజనే
భర్తు ర్విప్రకృతాఽపి రోషణతయా

మాస్మ ప్రతీపం గమః;
భూయిష్ఠం భవ దక్షిణా పరిజనే
భాగ్యే ష్వనుత్సేకినీ
యా న్త్యేవం గృహిణీపదం యువతయో
వామాః కుల స్యాధయః.

ఇచ్చట భరతఖండములోని చిరకాలసంప్రదాయాగతమైన సాధ్వీమణుల శీలము నచ్చొత్తినాఁడు. లోకాతీతమైన సౌశీల్యమే వనితల కిక్కడ నుపదేశింపఁ బడినది, "భర్తుర్విప్రకృతా ఽపి రోషణతయా మాస్మప్రతీపంగమః" అను కణ్వోపదేశమును కోపము వచ్చినప్పుడు శకుంతలయే పాటింపలేకపోయినది. "అనార్య! ఆత్మనో హృదయానుమానేన పశ్యసి. క ఇదానీ మన్యోధర్మకంచుక ప్రవేశిన స్తృణచ్ఛన్నకూపోపమ స్యానుకృతిం ప్రతిపత్స్యతే" అని భర్తను నిరాకరించి మాటాడుచున్నది. ఎల్లప్పుడు నెల్ల వనితలు నాచరింపలేకపోయినను లక్ష్యభూతమై యస్ఖలితధర్మస్వరూపము నిరూపింపఁబడియుండుట ముఖ్యమని కవి యాశయము. చివరకు హేమకూటగిరిమీఁదఁ దన్నుఁ గాంచి పశ్చాత్తాపమందు భర్తతో శకుంతల "నూనం మమ సుచరిత ప్రతిబంధకం పురాకృతం తేషు దివసేషు పరిణామాభిముఖ మాసీత్. యేన సానుక్రోశో ఽప్యార్యపుత్రో మయి తథావిధసంవృత్తః." అనినది. పతి తప్పుగాఁడుఁ దప్పుగాఁదోఁపని పతివ్రతాసౌశీల్యపరమావధి యిపుడు శకుంతల తపఃపరిపక్వమానసమునఁ గన్పట్టుచున్నవి. ఇది సీతలో సర్వదా కన్పట్టు.

అస్మాన్ సాధువిచింత్య సంయమధనా
నుచ్చైః కులం చాత్మనః
త్వయ్యస్యాః కథ మప్యబాంధవకృతాం
స్నేహప్రవృత్తించ తామ్;
సామాన్యప్రతిపత్తిపూర్వక మియం
దారేషు దృశ్యా త్వయా
భాగ్యాయత్త మతఃపరం నఖలు ర
ద్వాచ్యం వధూబంధుభిః.

ఈశ్లోకమున వస్తుధ్వనుల వెదఁజల్లుచు మహాకవిత్వమును గాళిదాసుఁడు చూపించుచున్నాఁడు. "సంయమధనుల మైన మమ్మలనాలోచించి- అనినప్పుడెన్నియైనధ్వనులు రావచ్చును.

౧. శాపాయుధులమైన మాయాశ్రమమునందలి కన్యను మాయాజ్ఞలేక వరించితివి. ఇప్పుడు పిల్లను పంపుచున్నాము. మమూసౌశీల్యమును నీ వెట్లు గ్రహింపఁగలవో !

ఇట్లే "అబాంధవకృతాం" అనునప్పుడును అర్థశక్తిమూలధ్వనులై యనేకార్థములును, పెక్కుభావములును దోఁచెడిని. "సామాన్యప్రతిపత్తి" అనునప్పుడు శబ్దశక్తిమూలధ్వని మర్యాదతో సభంగశ్లేషరూపమైరచన యర్థతతిని వ్యక్తపఱిచెడిని.

సరసిజ మనువిద్ధం శైవ లేనాపి రమ్యం
మలినమపి హిమాంశోర్లక్ష్మలక్ష్మీం తనోతి,

ఇయ మధికమనోజ్ఞా వల్కలేనాపి తన్వీ
కిమివహి మధురాణాం మండనం నాకృతీనామ్.
అనాఘ్రాతం పుష్పం కిసలయ మలూనం కరరుహై
రనావిద్ధం రత్నం మధు నవ మనాస్వాదిత రసమ్,
అఖండం పుణ్యానాం ఫలమివ హి తద్రూప మనఘం
నజానే భోక్తారం కమిహ సముపస్థాస్యతి విధిః.
ఇదం కిలావ్యాజమనోహరం వపు
స్తపఃక్షమం సాధయితుం య ఇచ్ఛతి,
ధ్రువం సనీలోత్పలపత్రధారయా
సమిల్లతాం ఛేత్తు మృషి ర్వ్యవస్యతి.
ఇట్టిచోటులఁ గాళిదాసుని యుపమాకల్పనాచాతుర్య మొప్పు.



# మృచ్ఛకటికము - నాయకౌచిత్యము.

ప్రకరణ మను పేరుగల యీరూపకమునఁ గవిపుష్కలముగ శృంగారరసమును సాధింపఁ దలఁచి నాఁడు. నాయికానాయకుల యందలి రతియొక్క యుత్కృష్టతచేతనే శృంగారరసము సిద్ధించును.

ఆరతి కులాఙ్గనలునున్నగువారియందు తల్లిదండ్రులు మొదలగువారి నిర్బంధముల నపేక్షింపనిదై సామాన్యలయందు ధనలిప్సతో సంబంధింపనిదై యుండవలెను. దానికి సౌభాగ్యమే కారణమై యొప్పవలెను. సౌభాగ్యమన నాయికయందు నాయకహృదయంగమత్వమును నాయకుని యందు నాయికాహృదయంగమత్వమునై యున్నది. మఱియు స్వయముగ జనించిన ప్రణయమహిమచే నెలకొల్పఁబడి పారవశ్యము గలిగించెడి యాస్థాయికి గుణసంపదయే యుద్దీపన విభావము కావలెను అట్టిస్థాయిభావమే సత్కావ్యదర్పణమునం బ్రతిఫలితమగుచు సహృదయహృదయముల నావర్జన సేయఁగలిగి రససిద్ధి యందు సమృద్ధిగ నుపకరణమగుచున్నది. ఇదిరసవిదులగు సత్కవులకు స్వారసికమైన మతము.

కాళిదాసుమహాకవి.

॥ అస్మాన్ సాధువిచింత్య సంయమధనా, నుచ్చైః

కులంచాత్మనః

త్వయ్యస్యాః కథమప్యబాంధవకృతాం, స్నేహప్రవృ
త్తించతాం
సామాన్యప్రతిపత్తిపూర్వకమియందారేషుదృశ్యాత్వయా
భాగ్యాయత్తమతః పరంనఖలుతద్వాచ్యం వధూబంధుభిః”

అను శ్లోకమున ‘అబాంధవకృతాం, అనెడి పదము చేత నీభావమునే సహృదయుల యెదుట వర్ణించెను.

ఇక్కడ వసంతసేన యెట్టిది? కులమువలన సామాన్య నాయిక. వేశ్యల వాడలలోఁ బుట్టిన వనితలకెల్ల సాజమైన ధనలిప్స యీ వెలవెలఁదికి లేదని యూహించుట కవకాశ ముండదు కదా. ఇది గాక ‘‘విటుల పాలిటి యమదూత వేశ్యమాత,, అని యొక కవిచే వర్ణింపఁ బడినట్లు ధనాంగన లకుఁ బెద్దపులి వలె తల్లియొకతె వెన్నుగాచుకొనియుండి తన ధనార్జనమునకే కూతునుపయోగించుకొనుచుండును,

అట్టి వసంతసేన చారుదత్తుని గుణములచేత నావర్జింప బడి చారుదత్తునందనురాగిల్లె. అప్పుడు చారుదత్తుఁడెట్టిదశలో నున్నాడు? దురదృష్ట పరిపాకము చేతను సహజౌదార్యము చేతను ధనహీనుఁడై యున్నాడు. అట్టివాని యందు వసంతసేనకు దృఢముగఁ బ్రణయము నిలుచుట చారుదత్తుని సుభగత్వముతోఁ బాటు వసంతసేనయొక్క యుదార ప్రకృతిని రసికతను వెల్లడించెడిని, ఆ ప్రణయ ప్రతిష్ఠయే శృంగారరస సిద్ధికిఁ జాలినంత రతిపరిపుష్టిని సమగ్రముగ సమకూర్చు చున్నది.

వసంతసేన యొక్క యీ గుణానురక్తత్వము దొడ్డ పరికృతిని సూచించుటకే రోహసేనుని మట్టిబండి ప్రసంగము తేఁబడినది. చూడుఁడు. చారుదత్తుని కొడుకు రోహసేనుఁడు తండ్రిదారిద్ర్యమునంజేసి మట్టిబండితో నాడుకొనుచుండెను. అది చూచి వసంతసేన సహింపలేక తనమహౌదార్యమునకు లక్షణముగ నిజహేమాభరణముల నెల్ల నాబాలుని మట్టిబండినిండనుంచి యింటికంపెను చారుదత్తునితో స్నేహము గోరుచున్నది గాన నామె స్నిగ్ధహృదయము చారుదత్తతనూజుని దరిద్రతకోర్వలేక పోయెను.

పొరుగు పిల్లలాడుకొనుచుండినట్లే చారుదత్తపుత్రుడును గ్రీడించుగాక హీనముగ నేల యుండవలెననెడి పక్షపాతము వసన్తసేనకాభరణలోభము కన్న వేయి మడుంగులుంగ నుత్పన్నమైనది. దీనికి మూలమేమి! చారుదత్తుని యందలి స్నేహమే అట్టిస్నేహము సర్వసామాన్య నాయికలకువలె ధనలోభమునకు సంబంధించినది కాదు దీనంజేసియే వసంతసేనను గుణానురక్తనుగాఁ బ్రదర్శించి విశుద్ధప్రణయమయమగు శృంగారమును సాధింపఁ దలఁచుకొనిన కవి యాశయము నెఱవేఱుచున్నది.

సర్వస్నేహములనుమించినది వాత్సల్యమని బాణమహాకవి చెప్పెను. అట్టివాత్సల్యము నీకవి చారుదత్తసుతునిజూచి నప్పుడు వసన్తసేనయందుఁ జూపించెను. ఇది ప్రకరణనాయికయగు వసన్తసేనయార్ద్రహృదయతను చాటుచున్నది. అదియే

సువిశుద్ధ ప్రణయ రసభరితమగు రూపకశృంగారమున కవలం
బమైన వసన్తసేనానురాగమును నిష్కల్మషముగఁ దెల్పుచు
సామాన్య ప్రధాన నాయిక గావచ్చునా? యను సంశయ
మును నివారించుచున్నది.

కాన రూపకముల కెల్లఁ బ్రాణమనఁదగిన రసమున
కీ ప్రకరణమునం దీ రోహసేన ప్రసంగము వసంతసేనయొక్క
సముచితానురాగ పరిపక్వ భావమును నివేదించుచు బ్రధా
నమగుచున్నది అట్టి ప్రసంగమున ముఖ్యమైనది మృచ్ఛ
కటిక [మట్టిబండి] దానినే ప్రకరణము యొక్క పేరులో నతు
కుట శూద్రక కవియొక్క రసపక్షపాతమును స్థిరపఱుచు
చున్నది. ఇది కవికుండవలసిన యౌచిత్యానుసంధానసామగ్రి.

ఇదిగాక పేరుచేతనే ప్రబంధమందలి కథాసారము
నెల్ల సమగ్రముగఁ దెల్పవలె ననునదియు నొక యాచారము
కవిసత్తములలోఁ గన్పట్టెడిని అభిజ్ఞానశాకుంతలము ముద్రా
రాక్షసము మున్నగుపేరు లట్టివే రోహసేనుఁ డాటకుపయో
గించుకొనెడి యీ మట్టిబండికూడ చారుదత్తుని గొప్పదారిద్ర్య
యమును దానికారణములతోఁగూడ ప్రకటించు చున్నది.
ఇందలి భూతకథ యంతయు నాతని దారిద్ర్యమునకుఁ గారణ
ములైన మహౌదార్యము యొక్కయు నితరదైవిక కారణ
ములయొక్కయు బహువిధప్రస్తావనలను బహుపాత్రముల
ముఖమునఁబ్రదర్శించుటచేతనే నిండియున్నది. దీనంజేసి
"మృచ్ఛకటికము" అను నీనామ మీ ప్రకరణమునం దశేష

కథావిశేషబోధక మనుచున్నాము. మఱియు నీ మట్టిబండి ప్రసంగమే చారుదత్త వసంతసేనల ప్రణయబంధమును దెల్పు నగాన, సొమ్ములమీది లోభమునఁ జారుదత్తుఁడే వసన్త సేనను జంపివేసెనని చారుదత్తునిమీద మోపఁబడిన నేరమునకు గారణమగుచున్నది. మైత్రేయుని చంకలోనుండి పడిన సొమ్ముల ప్రస్తావన చారుదత్తుఁడు దండ్యుఁడుగా నిరూపింపఁ బడుటకు ముఖ్యహేతువు. దాని కిది యాని కారణము. మట్టి బండి ప్రసంగముచే సూచితమగు వసంతసేన యౌదార్య మునకొక ఫలమైన శ్రమణకసాహాయ్యముచే నాయికా నా యకులు రక్షితు లగుచున్నారు.

ఇట్టి మహాత్ములు కొందఱుజ్జయనీపురమున నుండుటం జేసియే వీరియండ నుండు సాధువుల సాయమున నుమతి యార్యకుఁడు గాజయ్యెను దానివలననే సంపూర్ణాధికారము చారుదత్తునకు సంక్రమించెనని ప్రసక్తానుప్రసక్తి పరంపరచే నామమే సర్వప్రబంధార్థ బోధకమయ్యెడి.



# హర్షనైషధము-శృంగార నైషధము.



సంస్కృతమున నైషధశృంగారకావ్యప్రబంధము కవికులాదృష్టాధ్వపాంథుం డొనరించినది. దాని నశేషమనీషిహృదయంగమంబుగా శబ్దం బనుసరించియు, నభిప్రాయంబు గుణించియు, భావం బుపలక్షించియు' రసంబు పోషించియు, నలంకారంబు భూషించియు, నౌచిత్యం బాదరించియు, ననౌచిత్యంబు పరిహరించియు, మాతృకానుసారంబున భాషానైషధకావ్యంబుగ రచించినవాఁడు కవిసార్వభౌముఁడు. ఇట్లుద్ధతులైన మహాకవు లిరువురొక్క యితివృత్తమునం దమ వాణీవిలాసములం బ్రసరింపఁజేయునెడ నొక్కొక్కఁ డొక్కొక్కచో నొక్కొక్కని మించిపోవుచుండుట తటస్థింపక మానదు.

కావుననే యౌచిత్యం బాదరించెదనని ప్రతినవట్టిన వాఁడయ్యు శ్రీనాథుం డొక్కొక్కచో మాతృకలోని యౌచితిని దన తెనుఁగులోనికిఁ దీసికొనిరాలేక పోవుచున్నాఁడు. ఒక్కొక్కచో మాతృకలోని రసమును బోషింపలేకపోవుటయే కాదు, తద్రసస్సిద్ధిని దా నందఁజాలక నుడివడుచున్నాఁడు.

కొన్నియెడలఁ దన చిన్నారి పొన్నారి నుడికారములలోఁ జేర్చి క్రొత్త భావములతోఁ గూర్చి నూతనౌచిత్యముల నమర్చి యనన్యరసప్రవాహములం దేల్చి మాతృకలోని

వస్తువును నిస్తులముగ వాపణించుచున్నాఁడు. ఇది, పతిపద్య ము విమర్శించి శ్రీనాథుప్రతిజ్ఞ యను పేరున గ్రంథము వ్రాయఁదగి యున్నది. ప్రస్తుతము నా కన్గొనిన కొన్ని యంశములను సహృదయులకు నివేదించి గుణమున్న గ్రహింప వేఁడెద.

## శ్రీహర్షుని యధృష్యత.

శ్లో. వాసశ్చపరం నేత్రమహం న నేత్రం కిం ను నిత్యమాలింగయ తన్మయాఽపి, ఉరోనితంబోరు కురు ప్రసాద మితీవ సా తత్పదయోః పపాత. ౭-౮

ఉ. నేత్రము నేను, జీరయును నేత్రము; చీరకు నాశ్రయింపఁగా బాత్రతగల్గె నాకు నిటఁ బాత్రత లేదని నామసామ్యవై చిత్రికతంబునన్ బలిమిఁ జేకొనినట్టులు రాజుదృష్టి యా క్షత్రియకన్య చారుకటి చక్రము నూరుయుగంబు దూఁకొనెన్.—౩-౧౫౨

ఇట మాతృకానుసరణము లేదు. రసౌచిత్యాదులేవైన సంపాదింపఁ బడినవా? లేదు. చూపుపాదములమీఁదఁ బడుటకు హేతువు ప్రత్యేకింపఁబడుచున్నది కావున యాచకత్వసంభావనయే నలదృష్టికుచితము. 'ప్రసాదంకురు' అనుట యాచ్ఞకు సంబంధించినది. ఆఁధ్రీకర్త, ప్రాభవమునే నలదృష్టి కీఁయుదలఁచి పాదపతనమును దొలఁగినాఁడనిన "పాత్రతగల్గె, పాత్రతలేదు" అనుమాటలు ప్రతిగ్రహార్హతను దెల్పునవి, ప్రాభవమునకు సముచితములు కావు. క్షత్రియకన్య యగు

టయు ముట్టడింపఁ బనుటకే కాక యాచ్యతకును మిగుల ననుగుణమే.

“యాచ్ఞామోఘా వరమధిగుణే”

కాన యిప్పట్టున శ్రీహర్షుని పోకడయే మించియున్నది.

శ్లో. అస్యాం వపుర్వ్యూహవిధానవిద్యాం
కిం ద్యోతయామాస నవాంస కామః,
ప్రత్యంగసంగస్ఫుటలబ్ధభూమా
లావణ్యసీమా యది మా ముపాస్తే.

—౭-౧౨

క. వితత ప్రతిప్రతీకా
ద్భుత రూపవిలాస విభవభూషితయగు నీ
రతిబోటి తేటపఱుచుఁ
జతురానన హస్తశిల్ప చాతుర్యంబున్.

—౩-౧౫౮

ఈ తెలుఁగున మాతృక చాలమాఱినది. మాతృకలోని చమత్కారము రాలేదు. ఈనిర్మాణమునకుఁగర్త మన్మథుఁడగుటయే సమంజసము. రతి బోటియైననేమి? యెవరైననేమి? లావణ్యసీమ యుపాసన చేయుచున్న దను నంశమును దొలఁగించుటచే శ్లోకములోని జీవకళ యెగిరిపోయినది. మూలమున సీమపదము సర్వోత్కృష్టలావణ్యమును గనఁబఱచుచున్నది. ఉపాసకునియాత్మ యుపాస్యాధీన మయినట్లు లావణ్యసార మెల్ల దమయంతి కధీనమైయుండె నను టాదిగ బహుముఖ

మూలఁ బరిసరించు లక్షణామూలధ్వని ప్రపంచపరిష్కారము లేకున్నఁ గావ్యమెట్లగును?

శ్లో. తరఙ్గిణీ భూమిభృతః ప్రభూతా
జనామి శృఙ్గారరసస్య సేయమ్;
లావణ్యపూరోఽజని యౌవనేన
యస్యాం తథోచ్చైస్స్తనతా ఘనేన.

— ౭-౧౧.

తే. యౌవనాంభోధరోద్భూతహావభావ
వారిధారాఽభి పూర్ణశృంగారతటిని
యజ్ఞభవసృష్టివిద్యారహస్యభూమి
నిఖిలలావణ్యసీమ యీసీరజాక్షి. ౩-౧౫౫.

శబ్దార్థశ్లేషమయమైన యీ మాతృకకు దెనుఁగుసేఁత దుష్కరము. కవిసార్వభౌముఁడు యత్నించిన సాధ్యమయ్యెడిదేమో! భూమిభృత్పదము దొఱఁగి యజ్ఞభవసృష్టిని బెట్టుట మాతృకానుసరణలక్షణము గాదు. "ఉచ్చైస్స్తనతాఘనేన" అను నాయపుఁబట్టుల నుజ్జగింపవలసినప్పుడు భాషాంతరీకరణము మానుటే యుక్తమనుకొనువారు నుందురు.

శ్లో. ఆఘూర్ణితం పక్ష్మల మక్షిపద్మం
ప్రాంతద్యుతి శ్వైత్యజితామృతాంశు;
అస్యా ఇవాస్యాశ్చలదింద్రనీల
గోలామలశ్యామలతాంతారమ్.

— ౭-[illegible]

హర్షనైషధము-శృంగారనైషధము.

క. చలచంద్రనీలగోళా
మలకోమలతారతారమండలములు వ
త్పలములు ప్రాంశు శ్వేతం
బులు చపలములౌర! మెఱుఁగుఁబోఁడినయను

[నవమా. — 3-౧౬౪.

నేత్రములకుఁ బద్మసామ్యమును భావించి పద్మము లకు శత్రుజయమువలన గొప్ప చెప్పఁదగినట్లు కన్నులకును జంద్రజయమువలన గొప్ప చెప్పఁదగునని చమత్కరించి. కనుఁగొనల తెలుపును శ్రీహర్షకవి వర్ణించె. ప్రాంతద్యుతిచే తనే జయించెనని యుపమేయము గొప్పను బలపఱిచెను. ఇది యెల్లవిడచి 'ప్రాంశుశ్వేతద్యుతి' యనుపాఠ మాదరించి శ్రీనాథకవి తెచ్చినబాగు కన్పట్టదు.

శ్రీనాథుని స్వతంత్రత.

శ్లో. అంతఃపురాంత స్సవిలోక్య బాలాం
కాంచి త్సమాలబ్ధుమసంవృతోరుమ్;
నిమీలితాక్షః పరయా భ్రమన్త్యా
సంఘట్ట మాసాద్య చమచ్చకార. — ౬-౧౩.

చ. ప్రిదిలినసీవిఁ గేల సవరించు తలోదరి నొర్తుఁ గాంచి,లోఁ
గదిరినపాపభీతి బడిఁ గన్నులు మోడ్చ నొకళ్ళొకళ్లకై
యెదురుగవచ్చివచ్చి యొకయిద్దఱుముద్దియలొత్తిరవ్విభు
మదగజరాజకుంభముల మచ్చరికించు కుచద్వయంబులన్.

— 3-౭౬.

నలుగు పెట్టుకొనుటకుఁ జీరవిడిచిన స్త్రీ శ్రీహర్షునికి గోచరించినది. శృఙ్గారనైషధకర్తకు వదలినపోకముడిని గేల పవరించుకొను విలాసిని గన్పట్టినది. నలుఁడు కనులుమూసి కొనినప్పుడొకతె యచ్చటఁదిరుగుచు నతని నొరసికొనెనని శ్రీహర్షకవి భావించెను. శృఙ్గారనైషధకవి కాశృఙ్గారము చాలలేదు. ఇరువురు జవ్వను లెదురుగవచ్చుటంజేసి వారిద్దఱి కుచకుంభముల సంఘట్టనయును మహాసౌభాగ్యము నలునకు లభించినదని మురిసికొనుచున్నాఁడు. ఇం ద్రాంధ్రీకర్త రసికత యభినందపాత్రము కాదా?

అంతఃపురే విస్మృతవాగురోఽపి
బాలావలీనాం వలితైర్గుణౌఘైః;
న కాలసారం హరిణాం తదక్ష్ణో
ర్ద్వయం ప్రభుర్బన్ధుమభూన్మనోభూః. —౬-౧౯

ఇరులు గెలిచిన యంతఃపురేందుముఖుల
కురులు మరుఁడను వేఁటకాఁడురులు సేసి
మరులుగొలువంగ లేఁడయ్యె మనుజవిభుని
సరులులేని దృక్కంజనశాబకముల. ౩-౯౦.

ఇందు నలుని కన్దోయిని హరిణముగా శ్రీహర్ష మహాకవి భావించెను. శ్రీనాథమహాకవి నలునిదృక్కులను కాటుకపిట్టలతోఁబోల్చినాఁడు. దృక్కులకు హరిణసామ్యము కన్నఁ గాటుకపిట్టలపోలికయే మిగులఁదగునని తోఁచెడిని. ఇదిగాక సంస్కృతమున నారికేళపాకముననున్నశ్లోకమును ద్రాక్షాపాకరమ్యముగఁ దెలుఁగుసేసినాఁడు కవిసార్వభౌముఁడు.

ఏతం నలం తం దమయన్తి! పశ్య
త్యజార్తి మిత్యాలికులప్రబోధాన్;
శ్రుత్వా స నారీకరవర్తి సారీ
ముఖాత్స్వమాశఙ్కిత యత్ర దృష్టమ్, — ౬-౯౦

ఉ. వీఁడె నలుండు విశ్వపృథివీవలయైకవిభుండు వచ్చుచు
న్నాఁడని భీమభూమిపతి నందన నూఱడిలంగఁ బల్కుపూఁ
బోఁడులమాట నేర్చికొని ప్రోది శుకాంగన యట్లుపల్కఁగ నో
డేఁడిది నన్ను నేక్రియ నెఱింగెనొకో యని యెంచె నాత్మ
లో॥ — ౩-౧౦౮

మూలములోని శారికను శుకాఙ్గననుగా మార్చు
టయే కాక శంకనుగూడ శృంగారకవి మార్చివేసినాఁడు. నన్ని
దికనుగొనెనా? యేమియని దేవరహస్యము చెప్పుటను గూర్చి
నయూహ గలిగిన దన్నచో; దేవతల మహిమయెడ నలునకు
సంశయము న్నట్లగును. అది యమ్మహాపురుషున కుచితము
కాదని యెంచి కాఁబోలు శ్రీనాథమహాకవి "నన్నిది యెట్లు
తెలిసికొనెనో!" అని విస్మయమందినట్లు నలునిఁ జూపుచు
న్నాఁడు. అమోఘమైన దేవతల వరమట్లుండ దీనికి నేనెట్లు
కన్పట్టితినో యను విస్మయము నలుని పరిజ్ఞాతృత్వముతోడి
యుల్లాసవిలాసములను దెలుపుచున్నది.

అంబాం ప్రణత్యోపనతా నతాఙ్గీ
నలేన భైమీ పథి యాగమాన,

నభ్రాంతిభై మీాషు న తాంవ్యవిక్త్న
సా తంచ నాదృశ్యతయా దదర్శ. —౬-౭౨

ఉ. ఎంతయు డాయనేగియు మహీశుఁ డెఱుంగఁగ నేరఁ

డమె వి

భ్రాంతి విదర్భరాడ్దుహితృ పజ్క్తులలోన మృగాక్షినప్పు
డ య్యెంతి యెఱుఁగదయ్యెదిగ ధీశ చతుష్టయదత్త శాంబరీ
ధ్వాంతనిగూఢుఁడై న నను ధాధవుని౯నికటస్థలంబున౯.

—౩-౧౧౧

ఇం దదృశ్యః డనుమాటకు "దిగధీశ చతుష్టయ దత్త శాంబరీ ధ్వాంతనిగూఢుఁడు" అని పెంపుఁజేయుట "నలప్ర ణాలీమిళదంబుజాక్షీ సంవాద పీయూష పిపాసవః" అను సంస్కృతము నాంధ్రీకరించు పట్టునఁగల «నలనాలీకమృణాళనాళలతికాననవ్యప్రణాళీమిళ, ల్లలనాలాపకథానుథానుభవ లీలాలోలచేతస్కులై" అను రమణీయవిస్తరీకరణమును స్మరణము నకుదెచ్చెడిని.

శ్లో. లిపి ర్న దైవీ సుపఠా భువీతి
తుభ్యం మయి ప్రేరితవాచకస్య,
ఇన్ద్రస్య దూత్యాం రచయ ప్రసాదం
విజ్ఞాపయన్త్యా మవధానదానైః.

ఇది దేవేంద్రుని దూతి యింద్రసందేశమును దమయంతికి విన్నవించు సందర్భము. దీనిప్రారంభ మిట్లుండుట శ్రీనాథున కిష్టముగా లేదు.

హర్ష నైషధము - శృంగార నైషధము.

"సీ. అవధారు దేవి! దివ్యకిరీటకోటిసం
ఘానితవికచమందారదామ
సందోహమకరంద బిందుధారాధౌత
సందీప్త చరణారవిందుఁ డైన
సంక్రందనుండు నాస్వామి నన్నాయిందు
గారాబుసంచారిగా నెఱుంగు."

అని సందేశమునకు మున్ దుపోద్ఘాతమును జిత్రించి పెద్దన్నచే గురూపదేశముగఁ గైకొనఁబడిన "ఓమిహికాంశువంశకలశోదధి కౌస్తుభరత్న! భూపతిగ్రామణి!" యనుప్రేమోగుణాస్పదమైన సంబోధనను దలఁపించుచున్నాఁడు. ఇది గాక దేవతాలిపి యిక్కడివారికిఁ దెలియదు కాన నీ కింద్రుడు ప్రణయలేఖ్యమును బంపక నాచే సందేశ మంపెనని, కబురంపుటకుఁ గారణముఁ జూపించుటచేఁ దృప్తిఁ జెందక, దేవతాలిపి నీకుఁ దెలిసియుండిన నెన్ని ప్రణయలేఖ్యములు ముగ్ధమధురవైదగ్ధ్యసూచకములై నీకు వచ్చియుండునో! అని తనస్వామియొక్క యౌత్సుక్యవైదగ్ధ్యములను జాటుచున్నది దూతి యని యాంధ్రనైషధకవి యొంత వింతగ సంచరించెనో చూడుడు.

తే. చంచలనేత్ర! దివ్యలిపి సంతతిభూజనముల్ పఠింపలే
రంచును నూనెఁగాని నఖరాగ్రమునన్ లిఖియించి నీకుఁ
బుత్తెంచుఁజుమీ మహేంద్రుఁడు మదీయకరంబున
దేవతావనీ

కాంచనకేతకీకుసుమ గర్భదళంబునఁ గార్యపద్ధతుల్.

—3-౧౨౨.

ఇందు వాసవుని వరించినచో లభించెడి నందనవన రామణీయక సమృద్ధిని గూడఁ దటస్థోద్దీపన విభావసామగ్రిగా సూచించుచు దమయంతికిఁ దనస్వామిమీఁద ననురాగబు గలిగింప నెంచుట దూతి కెంతయు సముచితము.

శ్లో. సతీవ్రతైస్త్వద్రవ మిమంతు మంతు

మస్త్వద్వరం వజ్రిణి మార్జితాస్మిః —౬౧౧.

ఉ. స్వర్పతి చిత్తవృత్తి గలుషత్వమునందునొ యన్

భయంబు నా

కేర్పడలేదు విన్ము దివిజేశ్వరదూతిక! సప్తతంతుభా

గార్పణ మాచరించి కర మాదరణంబున నేను రాజకం

దర్పుఁడు నైషధాధిపుఁడు దన్ను నుపాస్తి యొనర్పఁ

గల్గుటన్. —3-౧౮౩.

సతీవ్రతములచేత, వాసవునియెడ నేనిప్పుడొనరించు నపచారమును మాపుకొందునని దమయంతి పలికెనని శ్రీహర్ష కల్పన. సతీవ్రతములు భర్తసాహచర్యముండినను లేకుండి నను ఆచరింపఁదగినవి అట్టివ్రతములకన్నఁ దనరాజకందర్పునితోఁ గలసి మెలసి యుండి చేయు గృహస్థధర్మములే ప్రస్తుతసందర్భమున దమయంతి కెంతయు రుచించుచున్నవి. ఇదికనిపెట్టి శ్రీనాథమహాకవి దమయంతిచేత "నైషధాధిపుదును నేనునుగూడి దేవేంద్రుని సేవించెదములే" అనిపించినాఁడు.

హర్షనైషధము-శృంగారనైషధము.

శ్లో. బ్రహ్మద్వయస్యాప్యనుభవత్ప్రమోదం
రోమాగ్రపర్వాగ్రనిరీక్షితేఽస్యాః;
యథోచితీత్థం తదశేషదృష్టౌ
పథ స్మరాద్వైతసుఖం తథాఽసౌ. —౭. ౩.

గీ. మానవతిమూర్తి యాపాదమస్తకముగఁ
దివుట వీక్షించి నిషధపృథ్వీకళత్రుఁ
డపుడు బ్రహ్మద్వయప్రమోదాతిశాయి
మన్మథాద్వైతసుఖవార్ధి మగ్నుఁడయ్యె. —౩-౧౨౪.

రోమాగ్రము గన్పట్టినంతనే బ్రహ్మానందము గలిగె. దమయంతి సకలావయవదర్శనమైనపుడు స్మరాద్వైతసుఖము కల్గుటుచితమేకదా యను శ్రీహర్షకల్పనలో రోమాగ్రదర్శనమనునది యెక్కువసరసముగఁ దోఁచనిచేఁగాఁబోలు నాంధ్రనైషధకర్త మార్చివేసినాఁడు. "అశేషదృష్టౌ" అనుమాట కాపాదమస్తకముగ వీక్షించి యను సర్వలోకశ్లాఘ్యమైన తెలుఁగుసూక్తి నుపయోగించి ద్రాక్షాపాకరమణీయతఘటించిన కవిసార్వభౌముఁడు బ్రహ్మద్వయప్రమోదాతిశాయి మన్మథాద్వైతసుఖవార్ధిమగ్నుఁడయ్యె ననుట విచిత్రమా?

శ్లో. సేయం మృదుః కౌసుమచాపయష్టిః
స్మరస్య ముష్టిగ్రహణార్హమధ్యా;
తనోతి నః శ్రీమదపాంగముక్తాం
మోహాయ యా దృష్టిశరౌఘవృష్టిః. —౭-౨౮.

తే. అతిపముష్టి ప్రతిగ్రహాస్థావలగ్న
సందియము లేదు పలరాజుచాపయష్టి
అట్లుగాకున్న ( గురియంగ నెట్లునేర్చె
ప్రకృతిశాతకటాక్ష నారాచవృష్టి. —౩-౧౬౩.

చూపులను శరవృష్టిని జేయు(గాన దమయంతి మన్మథచాపయష్టి యనిన శ్రీహర్షోక్తికన్న చాపయష్టి గానిచో నీదృష్టి శరౌఘవృష్టి యెట్లు? అను శ్రీనాథోక్తిలో సర్థపుష్టి గన్పట్టు.

శ్లో. జంబాలజాలాత్కిము కర్షి జంబూ
నద్యా న హారిద్రనిభప్రభేయః;
అ వ్యాంగయుగ్మస్య నసంగచిహ్నా;
మున్నీయతే దంతురతా యదత్ర. — ౭-౧.

తే. సాటిజంబేటిజంబాలజాలమునకు(
బాటినూత్నహారిద్రావిభంగమునకు(
దరము సౌదామనీదామధామమునకు(
గరము( బోలుపొందు దీనియంగములకాంతి.

—౩-౧౫౩.

దమయంతి నెమ్మేనిపసిమి వ్యక్తపఱుప( దల(చియు, అంగసంధులలో( గూడ నెమ్ములుగన్పట్టనట్లు లవయవములు మాంసలములై యుండెనని చెప్ప నెంచియు, మహాత్మకాకర్త క్లిష్టకల్పన( దెచ్చిపెట్టినాడు. ఆ చిక్కులో( బడక యాంధ్ర నైషధకర్త విశృంఖలముగ స్వతంత్రభావనను మూ(డగు

# హర్షనైషధము-శృంగారనైషధము.

పాదంబునఁ బొందుపఱుచుచు మొదటి రెండు చరణముల మాతృకాపర్యవసానముగ దేల్చివేయుచున్నాఁడు. ఎవరి యలంకారములు వారికే యుండుఁగాక. నారికేళపాకమును ద్రాక్షాపాకముంగ మార్చుట సోమరిపోతులగు కొందఱన్యులకుఁ గూడ నుపకారము సేఁతకద్దా.

శ్లో. పాణయే బలరిపో రథ భైమీశీతకోమలకరగ్రహ
మగ్ర్యమ్; భేషజం చిరచితాశనివాసవ్యాపదా ముపది
దేశ రతీశః

ఇంద్రుని చేతికి మన్మథుఁడు చిరకాలాశనివాసమునఁ గలిగిన విపాకములు పోవుటకై దమయంతీకోమల పాణిగ్రహణము నుపదేశించె ననునది యీశ్రీహర్షశ్లోకములోని సముచితకల్పన. దీనిని శృంగారనైషధకర్త యిట్లు మార్చెను.

మ. పవిసంగంబునఁ దాపమొందిన శచీప్రాణేశు కెంగేలికిన్
జివురుంగైదువుఁజోదు వైద్య ముపదేశించెన్
రహస్యంబుగా
ననసీహార పయోమిళన్మలయజ స్నానార్ద్రపర్యంతమై
యుపలాళించు విదర్భరాజతన యాహృద్యస్తనద్వంద్వ
మ్మ్. — ౫ ఆ. ౮౨ పద్య.

పాణిగ్రహణము మందుకాదని యెంచి యుపలాళించు స్తనద్వంద్వము మందలి మారిసికొను కవి నైషధమును శృంగారనైషధ మనుకొనినాఁడనుట యొంతయుఁ బొసగియున్నది.

భీమజా చ హృది మే పరమాస్తే
జీవితాదపి ధనాదపి గుర్వీ;
న త్వమేవ మమసాఽస్త్వతియస్యా
షోడశీమపి కలాం కిల నోర్వీ.

ఇంద్రాగ్నియమవరుణులు తన్నర్థించునపుడు నలుఁడనుకొనుమాట యిది;

"జీవితముకన్నను ధనముకన్నను మిన్నయైన దమయంతి నా హృదయమునఁ గలదు. భూమి యామె వదియారవభాగమునకైనఁ దగదు. కాని యామె యింతవఱకు నా సొత్తు కాలేదు"

ఈ యంశము శృంగారనైషధమున నిట్లు మార్చఁబడె.

క. ప్రాణంబుకంటె భీమ
క్షోణీపతితనూజమీఁదఁ గూర్మిగలదు గీ
ర్వాణాధీశ్వరుఁ డయ్యలి
వేణిన్ మదిఁగోరెనేని వేగమ యిత్తున్.

తనసొత్తింకను గాలేదనుమాటను నలుఁడే మఱచెనో కవి నలునిలోఁజేరి తానే మఱచెనో కాని యున్మాదవ్యభిచారిచే శృంగారస్థాయి మిగులఁ బోషితము. దీనను శృంగారనైషధము కాఁదగు. — సర్గ. 3 శ్లో.

భైమ్యా సమం నాఽజగణ ద్వియోగం
న దూతధర్మే స్థిరధీ రధీశః,
పయోధిపానే మునిరంతరాయం

దుర్వారమహోర్వీ మహోర్వీశేయగి.

"దూతధర్మనిర్వాహణదీక్ష నలునిలో స్థిరపడినది. వియోగమును లెక్కసేయుటలేదు." అని యిందలి ప్రకృతార్థము. "అగస్త్యుఁడు సముద్రపానసమయమున బడబాగ్నిని విఘ్నముగఁ బరిగణింపలేదు" అని యుపమ. ఉపమానమును బట్టిచూచినను బ్రస్తుతవర్ణనను బట్టి యాలోచించినను నలుని యందు శృంగారస్థాయికిఁ బ్రాముఖ్యము నొసంగక ధర్మవీరరసస్థాయికే పట్టాభిషేకము సేయవలెనని శ్రీహర్షుఁడు పూనినట్లు తోఁచెడి.

దీనిని శృంగారనైషధ మెట్లు మార్చిచూపుచున్నదో చూడుడు.

విరహభారంబుతోన యుర్వీధవుండు
ప్రబలమగు దేవకార్యభారము భరించె
నౌర్వశిఖతోన జలరాశి యంబుపూర
మౌర్వశేయుండు ధరియింపఁడయ్యె నెట్లు.

ఇందు శృంగారస్థాయికిని ధర్మవీరస్థాయికిని సరియైన తావు నలునం దొసంగఁబడినట్లు ప్రకృతవర్ణనలోఁ బూర్వార్థమునఁ దోఁచెడి. ఉపమాధ్వని నాలోచించిన రతికే ప్రాముఖ్యము గన్పట్టు. బడబానలముతోఁ బోల్పఁబడినది రతి. అంబుపూరముతో ఁపోల్పఁబడినది దూతధర్మదీక్ష. బడబానలము నీటిని బీల్చివేయుచు బొంగకుండఁ జేయుచున్నట్లు రతి ధర్మదీక్షను బీల్చివేయుచున్నది. ఇట్టిధ్వనికిముందు వర్ణనమూలు

కరాలంబము నిచ్చుచున్నవి. చూడుఁడు:

దమయంతీసుకుమారపాదకమలా
　　ద్వంద్వార్పణాధన్యకు
ట్టిమహర్మ్యంబగు పట్టణంబపుడు
　　గంటిఁ గంటి నం చెంతయుఁ
బ్రిమదం బందె దిగీశకార్యఘటనా
　　భారంబు చింతించి దీ
ర్ఘము నష్టంబును గానొనర్చె
　　ధరణీకాంతుండు నిశ్వాసముల్.

ఇందు రసికావతంసుఁడగు నలునియందు శృంగారస్థాయి రాజ్యము సేయుచున్నట్లును, దూతకృత్య నిర్వహణోత్సాహ ను బాధింపఁబోవుచున్నట్లును గన్పట్టుచున్నది కదా.

ఇంతమాత్రమున నలుని ధర్మవీరత లోపించి యనౌచిత్యమును గల్గించు ననుకోఁగూడదు. ప్రబలమైన నదమ యంత్యనురాగముచే దూతకృత్యము లోపముఁ జేసి స్వార్థపరుఁడైనచో నలున కనౌచిత వాటిల్లును. అట్లు సేయలేదు. నైసర్గికమై చిరస్థాయియగు ప్రియానురాగ మెంత యుం బ్రబలమైయుండినను ఆగంతుక మైన దూతకృత్యాదీ తను స్వకార్యవిఘాతుకమైనదాని నెంతయు ధర్మవీరుఁడు కను కనే నిర్వహింపఁగలిగెనని యౌచిత్యమే సిద్ధించును. నలుని కథలో నైషధకావ్యమున శృంగారమే ప్రధానము. దానిని బ లపఱుచుటకే ఆగంతుకమైన ధర్మవీరరసమును ప్రస్తుత శృం

గారమునకుఁ బ్రతిబంధముగాఁ గూర్చి ప్రతిబంధక వీరరసమును బాధింపఁగలిగి శృంగారమే ప్రముఖమయ్యెనని చూపించి నాఁడు.

ధ్వన్యాలోకమున నానందవర్ధనుఁ డిట్లు వ్రాసె—

వివక్షితే రసే లబ్ధప్రతిష్ఠే తు విరోధినామ్
బాధ్యానా మంగభావం వా ప్రాప్తానా ముక్తి రచ్ఛలా.

ఒకరసము ముఖ్యముగనుండ నితరరసము లనుకూలములైన నంగములుగ నుండవచ్చు. ప్రతికూలములైన బాధ్యములుగా నుండవచ్చు

శృంగారనైషధకర్త శృంగారప్రియుఁ డనుటకింకొక పద్యముం జూడుఁడు;

చ. ప్రిదిలిన నీవిఁ జేల సవరించు తలోదరి నోర్తుఁ గాంచి లోఁ
గదిరిన పాపభీతిఁ బడి గన్నులు మోడ్చు నొకళ్లొకళ్లకై
యెదురుగవచ్చివచ్చి యొక యిద్దఱు ముద్దియలొత్తి రవ్విభుఁ
మదగజరాజకుంభముల మచ్చరికించు కుచద్వయంబులన్

దీనికి శ్రీహర్ష శ్లోకముఁ జూడుఁడు;—

అంతఃపురాంత స్సవిలోక్యబాలాం కాంచిత్సమాలబ్ధ మసంవృతోరుమ్,
నిమీలితాక్షీ పరయా భ్రమంత్యా సంఘట్ట మాసాద్య చమచ్చకార.

# కావ్యనాటకాదిపరిశీలనము.

'సమాలబ్ధు మసంవృతోరుం' అనుమాటం దీసివేసి ప్రిదిలిననీవి కేల సవరించుననుట శృంగారపోషక మగుమార్పు కన్నులుమోడ్పన్ అని నలునియందు ధర్మ విరుద్ధమైన యను రాగోదయమును దీసివేసినను నాయికయందు శృంగారాను భావము భాసిల్లుచున్నది. పిమ్మట నొకనాయిక యదృశ్యుఁ డగు నలుఁడు కనుమూసికొని తొలగమిచేఁ గొట్టుకొనెనని స్వభావోక్తిగా శ్రీహర్షుఁడనెను. మనశృంగారకవి శ్రీ హర్షుని యొకనాయిక నిద్దఱఁగాఁ జేసి యీ రకకొట్టుకొనుటనుగూర్చి కుచద్వయములతో ముందొకరును వెనుకనొకరును నలుని గొట్టుకొనినట్లు వర్ణించుచు శృంగారోద్దీపనవిభావసామగ్రియగు నా కుచద్వంద్వమును' మదగజరాజకుంభయుగుల మచ్చరికించు' అను విశేషణముతో జోడించినాఁడు.

ఇట్లు పరికించిన శ్రీనాథనైషధమునఁ జాలచోట్ల శృంగారము ప్రముఖమై శృంగారనైషధ మనుపేరను శ్రీనాథకవి కావలెనని పెట్టెనేమో! అనిపించెడి, నిండుజవ్వనంబున సంతరించిన కబ్బముకదా.

# లక్షణ నిర్బంధము.



లక్ష్యప్రపంచము పలువిధముల వెలసి శాఖోపశాఖల తో విస్తరించుచుండునట్టును దానియందెక్కువయనుభవము గలపరిశీలకులచే లక్షణగ్రంథములు నిర్మింపఁ బడుచుండును. లక్షణవిజ్ఞానము లక్ష్యప్రపంచానుభవము శీఘ్రముగను సులువుగను గలిగించుటకు సుసాధనమై యుండును. చిరకాలము లక్ష్యపరిశీలనము చేసి యలవరించుకొను జ్ఞానమును లక్షణ సూత్రముం గ్రహించినంతనే విద్యార్థి పడయఁగలఁడు.

ఛందోలక్షణములు, కావ్యనాటకలక్షణములు, అలంకారలక్షణములు నాయికానాయకలక్షణములు, రసభావాదుల లక్షణములు, వాస్తులక్షణములు భాషాలక్షణములు (వ్యాకరణములు) మున్నగునవి పెక్కు. వీనియం దెల్ల యివియిట్లు చేయవలె నని కొన్నిఁటిని విధించుటయుఁ గొన్నిఁటిని నిషేధించుటయుఁ గలిగియుండు.

మాటలు లయతోఁ బల్కఁబడుటలోని యందమును గమనించిన విమర్శకులాయందము నివిచ్ఛిన్నముగా భాషలోఁ బాదుకొల్పనెంచి వృత్తములకు లక్షణములు గట్టిరి. వానిలో యతిప్రాసములు సంస్కృతములో లయకుమాత్ర ముపయోగించునవియై యుండిన వర్ణావృత్తిరామణీయకపక్షపాతవశీకృతమతులైన యాంధ్రకవులచే శబ్దాలంకారములలోనికిఁ దీసికొనఁ

బడి యక్షరనియమములను దావునైనవి. కాని పద్యములుగనే వ్రాయవలెనని లాక్షణికులు పట్టుపట్టక గద్యకవనమునకు సైత మవకాశము సనుగ్రహించి యుండుటంబట్టి యీ ఛందోలక్షణములచే శృంఖలాబంధము కవులకుఁ దయారుచేయఁ బడ లేదు.

కావ్యములనుగూర్చి వేనవేలు లక్షణములుంగలవు గాని యవి యన్నియుఁ గావ్యములయందమును గూర్చిన విభిన్నాభిప్రాయములను సూచించుచు సత్కవికి వెసలికనిచ్చి వానిప్రజ్ఞ స్వైరవిహార మొనరించుటకుఁ గొంత యాకాశము సృజించినవిగనున్నవి గాని కవిమనోయాత్రకు దారిలో నిబంధము గలిగించునవిగ లేవు ఇష్టార్థాలంకృతపదావళి కావ్యమన్నను, రమణీయార్థకశబ్దము కావ్యమనినను, నిర్దోషసగుణ శబ్దార్థములు కావ్యమనినను, రసాత్మకవాక్యము కావ్యమని నను వారిరుచిభేదములను దెల్పెడినిగాని కవియాలోచనకుఁ గాని సరసదృష్టిప్రచారమునకుఁ గాని సంకోచము గల్గవలసిన యావశ్యకత గన్పట్టదు గదా.

నాటకలక్షణమును దశరూపకమున ధనంజయుఁడు విపులముగ వ్రాసెను. ధనికుఁడు దానికి నంతఁబాడి గ్రంథమును బెంచెను. అందు నాంది, ఆముఖవిశేషములతోఁగూడి భారతీవృత్తి, కాశ్రియ మైనస్థాపన, విష్కంభాదులైన యర్థోపక్షేపకములు, అంకములలోని యసూచ్యకభావస్తువు,

మున్నగువాని కెల్ల నొక్కదానినైన వదలకుండ నవయువళ్ః విభజనముచేసి లక్షణశ్లోకము లేర్పఱుపఁబడినవి. కవి నాటకము వ్రాయవలెననుకొని కలమును గాకితమును దీసికొని నాంది వ్రాయఁబోవుచున్నాఁ డనుకొనుఁడు. అప్పు డతఁడు నవనవోన్మేషశాలిని యగుప్రతిభతో నేదేని క్రొత్తరకమును గల్పనలతోనో మఱి దేనితోనో సృష్టించి విద్యార్థిలోకము కృతజ్ఞతకుఁ బాత్రుఁ డగుటకును, అపూర్వచమత్కారనిర్మాత యగుటకునుఁ బ్రాప్తి లేదు భారతీ వృత్తి నాశ్రయించుట యని స్థాపకుని పని యొకటి.

అష్టపదనాందియా? ద్వాదశపదనాందియా? శంఖచక్రములు అబ్జములు చంద్రుఁడుం బద్యములో వచ్చిరా? యని తాతలనాఁటినుండియు వచ్చుచున్న సొగసులు నను కూర్చఁ బాటుపడవలెను. అట్లు నిర్మితమైన నాంది ప్రాఁతరకములోఁ జేరక యపూర్వరచన యెట్లు కాఁగలదు. వాఙ్మయమునకుఁ గ్రొత్తవింత విలాసపుసొమ్ములను యెట్లు తయారు గాఁగలవు. నూతనప్రియులగు లోకులహృదయముల నాకర్షించి యప్పటప్పటి కావశ్యకము లగుచుండు నూతనోద్బోధములను జేయుట యనువిధియం దెట్లు నాటకములు కృతకృత్యములు కాఁగలవు. నాంది యైనపిమ్మట స్థాపకుఁడు ప్రవేశించి రంగప్రసాదనమునో రంగప్రసాధనమునో చేయవలె నని ధనంజయుఁడు విధించుచున్నాఁడు శ్రుతి బాగుగ నున్నది. సంగీతము బాగుగ నున్నది. మద్దెల బాగుగ నున్నది. యని

చెప్పుటయే యిది యనికొంద ఱుదాహరించుచున్నారు. ఏప ద్యపుగణములలోనో వారు చెప్పినవి. వెనుకటివానికన్న కొంచెము విలక్షణముగనో అట్లో వ్రాయుటయే కదా కవి పని. ఇఁక నీతనిప్రతిభకుఁ బ్రయోజనమేమి. అడ్డులు లేని నిరామయాకాశమునఁ గొంతసేపు దూరముగ దృష్టి నిగుడించి సృష్టిలో వస్తుప్రకృతులయందు నిగూఢములై యుండురహస్యముల నుద్ధరించి తనసోదరులగులోకులకుఁ బంచిపెట్టెడి భాగ్యమెట్లు కవికి సమకూడును?

అనఁగా—సభ్యుల నిచ్చకపుమాటలతో నున్ముఖులను జేయుట, వీథ్యంగములను బ్రహసనాంగములను బ్రదర్శించుట, కథోద్ఘాతము ప్రవర్తకము ప్రయోగాతిశయము ననెడి యాముఖాంగములలో నొకదానిచేఁ బ్రదర్శింపఁబోయెడి కథను సూచించి విరమించుట. ఈస్థాపనలోని యాముఖాంగము ననునవి ధ్వనిప్రధానములుగను శ్లేషప్రధానములుగను నుండి యొక్కొకరీతి చమత్కారము నొసఁగునవిగనే యుండెడివి. కాని యట్టి పద్ధతులను జూపి కవి యిట్టి చమత్కారములను గ్రంథము కోలుపోకుండునట్లు జాగరూకుండు కావలె నని సలహానిచ్చుటలో లాక్షణికులు విరమించి యుండిరేని సత్కవి తనకాజన్మసిద్ధమగుసంస్కారము ననుసరించి యేదో క్రొత్త పోకడకుఁ బ్రాకులాడుట తటస్థించుచుండెడిది. అప్పుడు క్రొత్త క్రొత్త ఫలములను గవితావృక్షశాఖలపై మనము గాంచఁగల్గెడివారము. అప్పుడే పాడినదే పాటగాఁ గవితాప్రణాళిక విసువు గల్గింపకుండెడిది.

లక్షణ నిర్బంధము.

కథకు మొదట బీజమును, చివర ఫలమును, ఎల్లలుగా దీసికొని యీలోపలికథ నైదుభాగములు చేసికొనవలె నని నారు. ఈ అయిదుభాగములకును ఐదుసంధు లనిపేరులు పెట్టినారు. మొదటిది ముఖము రెండవది ప్రతిముఖము. మూఁడవది గర్భము. నాల్గవది విమర్శము. ఐదవది నిర్వహణము వీనిలోఁ బర్యవసాన మైనఫలమునకుఁ గారణము లయినవై దంశములను అర్థప్రకృతులని చెప్పి కథారంభమునుండియు ఫలసిద్ధి యెట్టియెట్టి పరిస్థితులలో నూచితమగుచున్నదో ఆవ రిస్థితులను, అర్థావస్థలను గాఁ జెప్పిరి. ఒక్కొక్క యర్థప్ర కృతి యొక్కొక్క యర్థావస్థతోఁ గలసిన నొక్కొక్క సంధి యగు. అవాంతరప్రయోజనములను జూపించుచు నైదునం ధులను బూర్తి చేయుటచే నుపక్రమోపసంహారములు సూ త్రంపట్టిన ట్లుండినశ్రోతలకువిశ్రాంతిగల్గుచు,ఆకాంక్షాపూర్తి యగుచుఁ బై కథపైఁ గుతూహలము గలుగుచుండునని లాక్ష ణికులబిగింపు. ఈరచనానైపుణి యిట్టినిబంధనములవలనఁగవి కేర్పడునది గాదు. బహువిధలక్ష్యగ్రంథరామణీయకపరిశీల నమున కలవాడుపడినవానికి జన్మాంతరసంస్కారము గలిగి కావ్యజ్ఞశిక్షను బొందినసుకవి కుపక్రమోపసంహారముల నేక రేఖమీఁద నడపింపఁగల శక్తి యలవడును.

ఇంకను విచిత్రము కలదు. నాటకకథ నైదుభాగము లుగ విభజింపఁబడినదాని నేఁబది చిఱుతునక్కలుగా నఱికివై చినారు. అవిసంధ్యంగములు. ఈపేలికలను సరిగ నటించుకొ

# కావ్యనాటకాదిపరిశీలనము.

ముచు సంధియను గంతను బూర్తి జేయుచుండుకవి నాటకము నకుఁ గావలసినయంశములను గూర్పుటయు గోప్యము లగువా నిని బ్రచ్ఛన్నములు సేయుటయుఁ బ్రకటన సేయఁదగువానిం బ్రకాశింపఁజేయుటయు రక్తియుఁ జమత్కారమును గథయుఁ బెరుఁగుటయు స్వాయముగ నెలకొనఁగలవని చెప్పి మనకు మార్గదర్శులైన లక్షణగ్రంథకర్తలు కృతజ్ఞతాపాత్రులగుచు న్నారు. కాని యిది మఱింత యస్వాభావికముగా నున్నది. ఒకసంధిలో వీనివరుసను మన మనుసంధానము చేసితిమేని యిది తెల్ల మగు.

ముఖసంధిలో—బీజన్యాసము, బీజబాహుళ్యము, బీజ నిష్పత్తి, గుణాఖ్యానము, ప్రయోజననిర్ధారణము, సుఖప్రాప్తి, బీజముమరలవచ్చుట, సుఖదుఃఖములు గల్గుపని, అద్భుతావే శము, గూఢమగువిషయమును బ్రకటించుట, ప్రకృతము మొదలిడుట యనునివి కవి కూర్పవలసిన సంధ్యంగములు. ఏద్రావిడప్రాణాయామములచేతనో వీని కాయాయిపుస్తకము లలో ధనికుఁ డుదాహరణములం నూపియుండెను ఈ పేర్ల కర్థములు గూడ బలాత్కారముగ లక్ష్యముల నన్వయింపఁ జేసికొనవలసినవే. ఏ కాళిదాసాదులైన నీజాబితాను ముం దుంచుకొని నాటకాదులు వ్రాసినవా రున్నారేమో యని చూతమన్న శాకుంతలాదులలో నెచ్చటను వరుసగా నీచిటు తపేలికల కుట్లు కన్పట్టవు. ధనంజయుఁడుగారును గొన్ని రత్నావళిలో గొన్ని వేణీసంహారములో గొన్ని

మఱొకచోటను అక్కడక్కడ నుదహరించెను గాని యొక్క చోటం బ్రణాళికగాం జూపలేదు.

ఈ సంధ్యంగములదాఁకఁ బోనేల? సంధులే సుప్రసిద్ధ నాటకములైన యుత్తరరామచరితాదులసరిగాఁ గన్పట్టవు. రామాయణకథలో సుగ్రీవకథయు విభీషణకథయు బతాకా ప్రకరులక్రిందఁ గన్పట్టుచున్నట్లు ఏ శాకుంతలములోఁ గన్పట్టుచున్నది? ముద్రారాక్షసమున రాక్షసవిరాధగుప్తసంభాషణము పతాకయని వ్యాఖ్యాతలు విఱిచినను ఏమిసరసముగా నున్నది? వేణీసంహారములోఁ గర్ణాశ్వత్థామలకలహముకన్న వృషసేనయుద్ధముకన్నను బతాక యనఁదగిన దేదికలదు?

ఉత్తరరామచరితములో బీజకార్యములనుగా వేనిని నిర్ధారణసేయవలనుపడెడిని? సీతాప్రాప్తి ప్రథమాఙ్కారంభము నుండియు నాయకునకు సిద్ధమైయుండునది కార్యమగునా! దానికొక బీజమును వెదకికొనవలెనా? రత్నావళిలోఁ సాగరికా రాగమును బీజమనియు యౌగంధరాయత్నమును బీజమనియు ధనికుఁడనును. బిందుప్రతిసంధినిం బ్రతియంకమున నన్వయించును, ఇవియన్వయింపని తావుల రక్తికిని చమత్కృతికిని సహృదయహృదయాకర్షణమునకును గొఱఁతయేమి వాటిల్లియున్నది. ఉత్తరరామచరితములో స్థాపనయందలి స్థాపకుడే యయోధ్యలోనివాఁడై పోయి శ్రీరాములవారినగరున వైతాళిక కృత్యములోనికి దిగినాఁడు. వేణీసంహారములో స్థాపకుఁడున్నట్లయుండి శ్రీకృష్ణులవారి హస్తినాపురాగమనో

త్సవములో మేళగాంధ్రలోఁ జేరుటకు విదురాజ్ఞను దనవారి
తోఁ జెప్పుచుఁ గథలో వాఁడగుచున్నాఁడు. ఇవియన్నియు
లాక్షణికులు గిరిగీచి నట్లు నడచు కవులచెయ్యులా? ఈనిబం
ధనములు మార్గదర్శనము కొఱకేర్పడిన వని గురుశిష్యసం
ప్రదాయములలో నుపదేశపరిపాటిక యవిచ్ఛిన్నముగా వచ్చి
యుండిన నవనవోన్మేషశాలికవిప్రతిభావిలాసములచే నింక
నెన్నిప్రయోగాతిశయము లెన్నిచిత్రగతులతో నాటకసృష్టి
లోనేర్పడియుండునో ఎన్నిరకములు కథోద్ఘాతము లుద్భవిల్లి
యుండునో మఱియు నెన్నిక్రొత్తరచనలు వీనితాతలవంటివి
కవికోకిలరుతములై యుండెడివో.

అలంకారలక్షణములు—ఏయలంకారముల లక్షణము
లెక్కడ నన్వయించునో ఆయలంకారములచ్చటఁగలవని చెప్పి
కొనుచుఁ దృప్తిపడుట మనవిద్యార్థుల కలవాటు. లక్షణములు
సమన్వయించినంతమాత్రమున నలంకారము లెల్ల సమాన
ములు కావు. అయ్యైకవుల కల్పనలలోని తారతమ్యములం
బట్టి యందము లెచ్చుతగ్గులఁ గాంచుచుండును. అట్టి
యందములు మనస్సులకెక్కినప్పుడే చదువరిచదువు సార్థక
మగు. ఆచమత్కారము ననుసంధానము చేయఁగలుగువాఁ
డే మరలఁ దనరచనలో నయ్యందము నప్రయత్నముగఁ
బడినదానిని గాంచఁగలఁడు. చమత్కారజనకత్వ మలంకార
సామాన్యలక్షణమనునిరూపణమునకు ఫలమప్పుడే కలుగు
ను. ఉపమాదులు కాళిదాసాదుల సూక్తులలో నుం

లక్షణ నిర్బంధము.

డును. సాధారణకవుల మాటలలోఁ గూడ నుండును. లక్షణములు సమన్వయించును. అంతమాత్రమునవియు సమము లగునా?

కొన్నియలంకారములు లోకోక్తిరూపములై యత్యంతహృద్యములగు. వానివలె నప్రసిద్ధము లైనవియు గ్రంథమాత్రదృష్టములు నైనవియు మంజుళములు కావు.

హరి జూడం బడసి లోచనము లమృతం బానినమాడ్కి......నెట్టన నిట్టియుల్కమదినిల్పితి రక్కెనతాల్మిఁజిచ్చోడి గట్టినయట్లు—ఉత్ప్రేక్ష

కొంతి యింతకుఁగ బజుగయి పాలలోఁ బడిన బల్లివిధంబున నుండకుండు నే?—ఉపమ

ఈయున్న రాజులందఱు! వాయుసుతున కొక్కయెత్తు వాఁడలిగిన శూలాయుధుఁడు వడఁకు—అతిశయోక్తి

పాండు కుమారులు నీతోఁడుపొత్తు మనియెదమనఁగా శ్రీరా మోకాలొడ్డిన వారివిధము కాదె?—ఉపమ

ఇల్లలికినఁ బండు గగునె దొంగ లానల్ పొడిచినఁ గోకల్ విడుతురే?—అప్రస్తుతప్రశంస

వీనియందము వేఱు. "సింగం బాకటితో గుహాంతరమునం జేడ్పాటుపైనుండి మాతంగస్ఫూర్జితయూధదర్శనము హోత్సాహంబుతోవచ్చునోజంగాంతారనిమానఖన్నమతి సన్నత్సేనపై వీఁడె వచ్చెం గుంతీసుతమధ్యముండు" హంసీవ కృష్ణ తేకీర్తిః స్వర్గంగా మవగాహతే.

అను నుపమలవంటి యలంకారములయందమరు వేఁడు. కావున నలంకారవిశేషలక్షణములను సమన్వయింపఁజే యుటచేతనే విద్యార్థులపరిశ్రమము సమాప్తినందక చమ త్కారజనకత్వమను సామాన్యరూప మెచ్చట నేరీతిగ భాషిం చుచున్నదో పరిశీలించి గ్రహించునంతకుం బ్రసరించినఁగాని కవితాతారతమ్యనిర్ధారణమున స్నాతకావస్థలోఁ బాల్గొనలేక పోవుదురేమో యనిభీతి. దీనికి లక్షణప్రపంచ మనపేక్షితని రాసము చే సంకోచమందవలసియుండునేమో?

రసభావాదులలక్షణములు— విభావానుభావసంచారి సంయోగము వర్ణించినంతనే క్రౌంచపక్షిచావుచూచి కలంగి పోయిన వాల్మీకివలె నార్ద్రహృదయుఁడు గానివానిపలుకుల రసము పొసగనప్పుడు రసభావలక్షణముల ప్రయోజనము లన్నద ప్పిమి? రసనిరూపణము పట్టున శృంగారమునకుఁ బోలె రసాం తరమునకుఁ బట్టాభిషేకముఁ జేసినట్లు గన్పట్టదు. మానస ప దార్థముయొక్క మార్పులు మన్నగువానిని బాగుగఁ బరిశీ లించి మానసవికారములనుఁ బట్టి కల్గెడి కాయికవాచికవిక్రి తులను వివరించునది యీరసవిమర్శనము.

కాని శృంగారములోని విశేషములను జెప్పినట్లు వీరా దులలోని భేదములను మనలక్షణకర్తలు నిరూపింపరైరి. సం చారిభావముల ననుభావములను జెప్పియుఁ బునరుక్తిం బో లునట్లు హావభావాదులు మున్నగువాని నెన్నిప్రణాళికలతోడ నో శృంగారమువివరింతురు. ముఖ్యముగ నిది గమనింపుఁడు

# లక్షణ నిర్బంధము.

కిరమున్నగునాయికలు ఇతరనాయికల, బ్రేమించి సాపరాధు లగునాయకులమీఁద నెట్లు కోపపడుదురో రతికేళులనెట్లుందురో అనువిషయముల నాలంకారికులు నాయికా నిరూపణమునఁ జెప్పుదురు ఖండితుల ననునయించుపట్ల నాయికానాయకుల చెయ్వులను బ్రపంచింతురు. వీనికన్న నాయికలకు లోఁతి సేఁత లేమియు నుండవా? అట్టిచేష్టలెల్ల నాయికాస్వభావపరిసీలనము పట్టున నుపయోగింపవా? శృంగారవస్థలలో మాత్రము నాయికానాయకులను తెగవర్ణించియుంట కేవలభోగపరాయణు లగురాజుల యాస్థానములకు దాసులై యుండుట యనెడి కవు లదుబ్ధిను వారివిమర్శస్వాతంత్ర్యము నపహరించినదానిని, సూత్రకారులకాలములోవలె స్వతంత్రపరిశీలనగ్రంథముల నిర్మాణమును భరతఖండములోఁగల్గకుండఁ జేసినదానినిసూచింపవా?

కం. వేఁడికొని కృపణులై కను
పోఁడిమి యదియేల? రాజపుత్రులు దమమై
వాఁడిమిఁ దప్పిన నిప్పులు,
వేఁడిమి సెడినట్లు జనులు విని యులుకుదురే.

గీ. కొడుకుఁగాంచు రాచకూఁతురెద్దానికి,
నట్టిపనికి నుచితమైన సమయ మొదవెఁ
దడయ టెంక నొప్పదు జనములు,
నట్లుగాని పురుషు లనరుమిమ్ము.

కం. భుజబలమున జీవించుట,
నిజధర్మము మెత్తఁబడుట నింద్యము మాదీ

ప్రజలకుఁ జెప్పుము దుగ్గివదా,
తన్నజఁగార్యంబడుగుమనుము తగనందఱితోన్.

అని కొడుకులకుఁ జెప్పించుచోఁ గొంతి యేనాయికగా నుండెనో వివరింపవలదా! ఈక్రిందిచోట్ల ద్రౌపది మాటలే భావముల నెట్లు సూచించెనో నిర్ధారణసేయవలదా.

"అంతనయూఁళులేవురకు నైదు సుయోధనుఁ
డిచ్చునొక్కొ యీ
కంతకృపాలవిహీనమతి నాఁతడు నొంచునె! యన్నదమ్ముల

చ. తనమునుపట్టబన్నములు దమ్ములనిప్పఁ గలకూర్మిపేర్మి నీ
జనపతి సైఁపకున్న యదినక్కఁన రాజ్యము పాలులేకతీ
అున కొడఁబాటు గల్గిన నెఱుంగమి పెట్టరెని చాలరైరి వీ
రనరొకో! నావలేమియని యాడరె? లోకమువారు కేశవా!
"అచ్చోటనవంగరంబులగుచొప్పలుపుట్టినవైనఁ భాండవుల్
పోటున కిచ్చగింతురొకో! పోదురొ కానలనుండ నచ్యుతా"

చ. అరయమిఁజేసి కోడలన కప్పుడు దాసిగఁ జేసె నమ్మహా
పురుషునిపాలికిం బతులు వ్రేఁగ వీరలతో న యేను జె
చ్చెరఁజని కోటరంబు దగఁజేయుదునో యటుగాక పాడిమై
వరవుడమోసిచేయుదునొ వారికిమాధవ! నిర్ణయింపుమా!

సత్యభామ నరకాసుర యుద్ధములో నెట్లు మాటెను. అయ్యవస్థయెట్టిదని నాయికాలక్షణగ్రంథకర్తలు గ్రంథముల వ్రాయవలదా?

# లక్షణ నిర్బంధము.

తెలుఁగులో సంస్కృతముంజూచి కావ్యరసభావనాయి
కానాయికాదుల లక్షణములు వ్రాయనమకట్టినవారిని విన్న
కోటపెద్దనను మూర్తికవిని మన మెఱుంగుదుము. వీరుమఱింత
యూస్థానదాసులు,రసములయొక్క సిద్ధించుటనుగూర్చి సంస్కృ
తమున వేనవేలు విమర్శములు గన్పట్టుచుండఁ గావ్యాలంకార
చూడామణిలోఁ గాని కావ్యాలంకార సంగ్రహమునఁ గాని
తాదృశవిమర్శములు మందునకైనఁ గన్పట్టవు. వ్యంజనావృత్తి
యావశ్యకమా? కాదా? యనుగాఢవిచారణ, ధ్వని, ఆలోక
ము లోచనము కావ్యప్రకాశిక రసగంగాధరము సాహిత్య
దర్పణము మున్నగు హొత్తములలో సంపూర్ణముగఁ గన్పట్టు
చుండ వాని విచారణ లేశమైన నరసభూపాలీయకావ్యాలం
కారచూడామణులలోఁగన్పట్టకుండుటమిక్కిలిశోచనీయము.

దశరూపక మీమధ్యకాలమున నాంధ్రీకృతమయ్యెను
ఏ తాదృశదశ కేపాత్రమైనది.

చతుర్థప్రకాశములో 'విరుద్ధై రవిరుద్ధైర్వా' అనుశ్లోక
మును స్థాయిభావలక్షణముగా ధనంజయుఁడు వ్రాసెను. ధని
కుండు దనయవలోకమున విపులముగ విమర్శించి విరుద్ధభావ
సమావేశమునం దెట్లు బాధ్యబాధకభావనిర్వాహమునఁ గవి
సమర్థింపవలెనో అవిరుద్ధములగు భావములు గలసినపుడంగాం
గిభావముతో నెట్లు సంతరించుకోవలెనో సహానాలంబనవిభా
వవిరోధము ఆనంతర్యవిరోధము మున్నగునవి యేసందర్భమున

నెట్లు ప్రసంగింపవలెనో తెలిపినాఁడు. ఈప్రశంసయే తెల్గుదశ
రూపకమునఁ గన్పట్టదు మఱియు "వాచ్యాత్ప్రకరణాదిభ్యో బు
ద్ధిస్థా వా యథాక్రియా వాక్యార్థః కారకై ర్యుక్తా స్థాయీభావ
స్తథేతరైః ,, అనురసవిచారణపట్టునఁ గావ్యనాటకాదులలో
రససిద్ధివ్యంజనాధీనమా తాత్పర్యాధీనమా? ఏలకాదు? అను
విషయములు పూర్వపక్షసిద్ధాంతములతోఁ జక్కఁగా విమర్శిం
పఁబడినవి. చివర భావ్యభావకభావసంబంధము కావ్యరసముల
కని మీమాంసతోడి నిర్ధారణతో విచారణ పూర్తి కావింపఁ
బడినది. ఇది యించుకయుఁ దెల్గుదశరూపకమునఁ గన్పట్టదు.

ఇట్లు విచారణావిహీనములై బంధకలక్షణవిధానముల
చేత మాత్రమే పూర్తియగుచున్న లక్షణగ్రంథములు తెలుఁ
గున నేర్పడుట మఱింత హానికరము. నరసభూపాలీయ కావ్యా
లంకారచూడామణులలోఁ బ్రబంధములకంటె నెక్కువగఁ
గవితానైపుణి చూపఁబడక పోలేదు మూర్తికవిగాని విన్నకోట
పెద్దనగాని కృతినాయకుల వర్ణనలయందుఁ దత్పరులైనట్లు కా
వ్యాలంకారలక్షణ నిర్మాణమున దత్తదృష్టులు కారు. కృతి
భర్తలను వర్ణించుటయను పనిపెట్టుకొని యప్రధానముగా
నలంకారాదుల లక్షణములను బ్రతాపరుద్రీయమును జూచి
చెప్పుటకుఁ బ్రారంభించినవారీకవులు. వీరియస్పష్టలక్షణముల
సమన్వయించుకొనుటయందలి క్లేశ మాపాధ్యాయలోకమున
కవిదితము కాదు. ఇట్టిలోపములు, తెల్గువాఙ్మయమునఁ గవులకు
గట్టుత్రాళ్లుగనుండక మార్గదర్శిత్వమున వికలములుగాని లక్షణ
గ్రంథము లేర్పడుటచే దీఁటఁ గలవు.

# లక్షణనిర్బంధము.

ప్రాథమికల్పికులగు వారలకు (అభ్యాసావస్థలోనివారికి) లక్షణగ్రంథములు చేయూత. అట్టివారి కాగ్రంథముల యాశ్రయము గోరఁ దగినదికాదు. అభ్యాసావస్థను దాటినశబ్దబ్రహ్మవేత్తలు మహాకవు లనంబడుదురు. శబ్దబ్రహ్మవేత్తృత యనఁగా, ఏశబ్దము లేసందర్భమున నేయర్థములో నుపయోగింపఁబడి యెట్లు రసభావవ్యక్తిస్థానములు కాఁగలవో యెఱింగినవారు. లేక స్వయముగఁ బాడకట్టువారు. "యంబ్రహ్మాణమియం దేవీ వాగ్వశ్యేవానువర్తతే," అని భవభూతియు "మాతాదాకృష్టానాం కతిపయపదానాం రచయితా జనః స్పర్ధాళుశ్చేదహహ కవినావశ్యవచసా," అని బాణుఁడును "యేనమాద్యంతిధీమంతో మధునేవ మధువ్రతాః," అని దండియు, "శబ్దబ్రహ్మవిదః కవేః పరిణతాం," అని మురారియు "యత్సారస్వతవైభవం గురుకృపాపీయూషపాకోద్భవం తల్లభ్యం కవినైవ," అని మఱియొకరును బరిశీలించి చూచి చెప్పియుండిన యొకమహాకవిపీఠము కలదు. దానినధిష్ఠించినవారే మహాకవులు. వీరే కవీశ్వరులు ఈశ్వరపదముంజూడుఁడు. కవుల నేస్థానముననిల్పెడినో వీరివాక్కులే యౌచిత్యాదిసంపన్నములై లోకము నాకర్షింపగలవిగ నుండును. ఇట్టివారికి లక్షణము లాశ్రయణీయములుగావు. దేశకాలములనుబట్టి పరిష్కరణీయము లైనఁ గావచ్చును. ఇట్టిమహాకవు లెప్పుడును బుట్టుచుండుదురు. ప్రాచీనులలోనే మహాకవులుండి యిప్పటి వారిలో లేరనుకొనవలసిన పనిలేదు. "పురాణ మిత్యేవ నసాధు సర్వం నచాపి కావ్యం నవమిత్యవ

ద్యం'' అని కాళిదాసుఁ డనెను. కొందఱు మహాకవులకుఁ గూడ లక్షణబంధము లడ్డుకొనుచుండవలె నందురు. అట్టి సిద్ధాంతసంప్రదాయమును నవీనలోకము నిరసించుట దోషము కాదు. సర్వసామాన్యముగా లక్షణనిరసనము కార్యమనుట హానికరము. లక్ష్యవిషయబాహుళ్యరూపముగఁ బ్రవేశము లక్షణములయూఁతలేక యొదవదని మనవిచేసియుంటిని. ఒక మహాకవి యిట్లు చెప్పుచున్నాఁడు. ''ప్రవేశఫలమ్ములు చిన్ని చిన్ని వ్యాకరణపుఁ బొత్తముల్ గొణిగి కయ్యము పెంచ కుఁడయ్య వాగ్విదుల్.''

కాలిలో విఱిగినముల్లు దీసివేయుటకు మఱొకముల్లును జేకొనవలెను. ముల్లు పైకివచ్చిన పిమ్మట రెండుముల్లును దూరముగఁ బాఱవేయవలెను. వేదాంతమునఁ జెప్పుచుండెడి యియ్యుదాహరణము సృష్టియందుఁగూడఁ బనికివచ్చుచున్నట్లున్నది. లక్ష్య ప్రపంచపరిచయము దార్ఢ్యము నందునంతకును లక్షణముల. సాధించవలెను లక్ష్యప్రవాహమున గాలాని ని నిల్కాడఁ గాంచి పిదప లక్షణప్రామాణ్యదృష్టియను బంధమును వదల్చుకొని స్వతంత్రుఁడై వాఙ్మయ స్రష్ట యై కవిబ్రహ్మ యనిపించుకొనవలెను వాఙ్మయమును బట్టి జీవలోకయాత్ర మాఱుచుండును. కాన వాఙ్మయసృష్టి లోకస్రష్ట యగుచున్నాఁడు. కనుక కవిబ్రహ్మ యనఁబడెడి. అట్టిబ్రహ్మత్వము దేశకాల పరిజ్ఞాన పురస్సరముగా నేకాలమున కెట్టివాఙ్మయ మెట్టిరీతులతో నావశ్యకమో కనిపెట్టి గ్రంథనిర్మాణకార్యభారమునఁ బూన్గొనినఁగాని సార్థకముకాదు చూడుఁడు—మమ్మటభట్టుగారు వ్రాయుచున్నారు. "నియతికృత నియమర

హితాం హ్లాదైకమయీం మనస్యపరతంత్రాం ... ... నిర్మితి మాదధతీ భారతీకవేర్జయతి.

సారాంశము.—ప్రాచీనలక్ష్యములలోని యందములను సంగ్రహముగను సులువుగను దెల్పుట కేర్పడినవి కాన లక్షణగ్రంథములు భావిలక్ష్యప్రపంచ నిర్మాతలగు కవులస్వాతంత్ర్యము నపహరించునవి గాక మార్గదర్శకములై యుండవలయును. ఔచిత్యవిదులగు బహుసద్గ్రంథకర్తలయు మహాకవులయు గొప్పపండితులయుం బోకడలు లక్షణ పరిష్కరణక్షమము లొకప్పుడు కావచ్చును. తెలుఁగున లక్షణగ్రంథములు తక్కువ. సంస్కృతప్రతాపరుద్రీయాదిసాహిత్యలక్షణగ్రంథములవికృతులు కావ్యాలంకారసంగ్రహము, కావ్యాలంకారచూడామణి వేదము వేంకటరాయశాస్త్రిగారి కావ్యాలంకారము మున్నగునవి కొలఁదిగఁ గలవు. కాని సంపూర్ణములు కావు. కాన సంస్కృతమునుండి యాంధ్రులు లక్షణగ్రంథములను దీసికొనవలసినవారై యున్నారు. ఇట్టియెడసంస్కృతలక్షణములను దూచాపోకుండ నాంధ్రీకరించుకొనవలసినదా? సంస్కృత లక్షణగ్రంథముల నవలంబనములుగఁ జేసికొని క్రొత్తపద్ధతులతోఁ దెల్గున లక్షణముల నిర్మించుకొవలెనా? అనిపరిశీలనము చేయవలయును. కావున దశరూపకము మున్నగు నాటకలక్షణములలోనను గావ్యాలంకారాదుల లక్షణములం దెల్పెడి లాంటి గ్రంథములయందును గొన్ని చేకొనవలసినవియుఁ గొన్ని వీడఁదగినవియుఁ గన్పట్టెడిని. వానిని బరిశీలించి విచారణల మీఁద నేదోపద్ధతిని నిర్ధారణచేసికొని యాంధ్రవాఙ్మయమున సముచిత గ్రంథనిర్మాణమునకై కవులుగడంగవలయును.

# చింతామణి సూచన



సంస్కారార్థో నియమః,



అను సూత్రముతో గొప్ప భాషా సంప్రదాయ రహస్యమును నన్నయ సూచించి నాఁడు. ప్రజలు వాడుక భాసలో గ్రామ్యములును, గ్రాంథికములు నగు పదములు వచ్చుచుండును. వారు తిరమైన గ్రాంథిక భాషాసృష్టి సేయునప్పుడు గ్రామ్యములను జేరనీయక గ్రాంథికపదములనే వాడినచోఁ శ్రాయిక నిత్యప్రయోగరూపమైనట్టియు, సంకేతిత సుప్రసిద్ధపదభూయిష్ఠమైనట్టియు, రసాత్మక వాగ్రూపమైనట్టియు, విశ్వశ్రేయస్సాధనమైన గ్రాంథికభాష నిర్దోషమై పరిశుద్ధి వహించియుండునని శబ్దానుశాసనాదుల యానాఁటి యాశయము. ఇట్టి నియమమును జేయునది వ్యాకరణమే. వ్యాకరణము రాని వాఁడు తనకు సాజముగఁ బుట్టినప్పటినుండియు వచ్చిన భాస లోనిది హేయమనియు, నిది యుపాదేయమనియు వేఱుపఱుచుకోలేఁడు కదా.

కాని వస్తాడు, తెస్తాడు మున్నగునవి చేరినఁ బాత్రములకపరిశుద్ధి యెట్లువచ్చునో మనము ప్రత్యక్షముగఁ జూడఁజాలకున్నాము.

## చింతామణి సూచన.

ఇయ్యెడ దండి మొదలగు ప్రాచీనాలంకారికులచేతను, నన్నయగారిచేతను వాడఁబడిన గ్రామ్యశబ్దము మనకుఁ గొంతవఱకుఁ బనికి వచ్చుచున్నది.

"నిష్ఠ్యూతోద్గీర్ణవాంతాది గౌణవృత్తివ్యపాశ్రయమ్,
అతిసుందర మన్యత్ర గ్రామ్యకక్ష్యాం విగాహతే."

అని దండి వ్రాసె.

ఇచ్చట గ్రామ్యపద మసహ్యంబుకొనఁబడుదానియందు జుగుప్సితాది శబ్దములవలెఁ బ్రవర్తించెడిని.

'కామం సర్వో ప్యలంకారో రస మర్థే నిషించతి,
తథా ప్యగ్రామ్యతైవైనం భారం వహతి భూయసా.'

ఇచ్చటను జుగుప్సితార్థముగనే గ్రామ్యపదము వాడఁబడినది. పైపెచ్చు దీనిని రసస్ఫూర్తిప్రతిబంధమనియు దండి వక్కాణించెను.

ఇది యెల్ల రూఢ్యర్థమేకాని యోగబలమున నింత యర్థము రానేరదు. యౌగికార్థమీపదమునకు గ్రామము లోనిదని. నిరూఢలక్షణచే వచ్చెడియర్థము ప్రసిద్ధమై శక్యార్థమును జంపివేసినది. కుశలదంతురాది శబ్దము లిట్టివే. దీనివలనఁ జరిత్రము మాత్రము కొంత తేలుచున్నది. గ్రామములోనివారు పౌరులకన్నఁ దీసిపోయియుందురు. కాన జాన పదులు మాటాడు మోటబాసను నాగరికు లేవగించుకొనుచు వచ్చియుందురు. గ్రామీణులు కూడ తెలుఁగు బలిసినకొలఁది, తెలివి మించినకొలఁది తాముకూడ నాగరిక వేషభాష

లను గైకొనుచుంద్రు. కాని స్వీయగ్రామ్యత్వానైచ్యా నిరాకరణముకై పాటుపడరు. 'గతానుగతికో లోకో' యనునట్లు పోవుచుండు లోకయాత్రాప్రవాహమున కెదురీదఁగల వాఁడు లక్షకొక్కఁడు. అట్లు నాగరికవేషభాషానుకరణపరాయణు లగువారికి రాజునుగన్న కన్నుల మగనిఁజూచిన మొట్టబుద్ధియైన దన్నట్లు, బీదసాదల మాటబాస రుచించునా? అట్లు క్రమముగఁ దక్కువవారు మాటాడుబాస గ్రామ్యమై జుగుప్సితమగుటచే గౌణమర్యాదచే జుగుప్సితములైనవెల్ల గ్రామ్యములని వ్యవహరింపఁబడుచు వచ్చినవి. దండి గ్రామ్యములని చెప్పినవి కొన్ని ఉమ్మి, కక్కు మొదలైనవి స్వరూపముచేతనే యసహ్యించుకోఁదగినవి. కొన్ని పల్లెటూళ్లలో నాగరికత నెఱుఁగని వారిమాటలు. కనుక హీనులు మాటాడిన వస్తాను, పోతాను ప్రభృతి పదంబులు గ్రామ్యములగుచు హేయములైనవి ఇంగ్లీషు ప్రభుభాష కానఁగదా రానివారు కూడ దానిని గొప్పకై మాటాడఁబోదురు. దొరలవంట్లములను హిందువు లేల వేసికొందురు? వారు పింజెగోచుల నేల పెట్టరు? కాన వేషభాషల గొప్పధర్మలను, వ్యవహర్త్లను బట్టియే వచ్చును. తద్భవములెల్ల గ్రామీణులనోటఁ బుట్టి పాత్రములఁ గై సేయుచున్నవే.

'సోఽర్థస్తద్వ్యక్తిసామర్థ్యయోగీశబ్దశ్చకశ్చన' యని యానందవర్ధనాచార్యులు సెలవిచ్చినవిధమున రసభావాద్యేక వ్యంజకమ్ములైన కతమున వీడరానివిగ మహాకవికటాక్ష భాజనములై కొన్ని పదాలు వానిభాగ్యవశమున గ్రంథముల

కలంకారములైనవి. అట్టి యదృష్టము లేనికొన్నిపదాలు పుట్టినవి పుట్టినట్లే నిలిచిపోయినవి. ఇప్పుడామాటలు పస్తాము మున్నగునవి శిష్టాగ్రేసరుల నోళుల మసివేళల సైతము నాట్యమాడుచున్నను, మొదట వచ్చిన గ్రామ్యమును నెంగిలి పేరు* బ్రాహ్మణశ్రమణకన్యాయమున వానిని వదలక వేధించుకొని తినుచున్నది.

ఇట్లు గ్రామ్యభాష యొక్క హేయత చాలవఱకు వ్యవహర్తలతక్కువదనముచేత నేవచ్చినదనియూహింపవచ్చును

అట్టి గ్రామ్యభాష నుపయోగించిన సారస్యము చెడు ననుటయు యుక్తివిరుద్ధము కాదు.

'శబ్దేపి గ్రామ్యతాఽస్త్యేవ సాసభ్యేతర కీర్తనాత్,
యథా యకారాదిపదం రత్యుత్సవ నిరూపణే.'

అని దండి.

గ్రామ్యపుమాటలు వినుటతోడనే అనుకార్యులు, నీచవేషభాషలు కలవారు మనమనసునకుఁ బొడకట్టుదురు. గుణాలంకారాదిచమత్కార విశిష్టపద ప్రతిపాద్యములయి రమణీయములగు ద్రవ్యగుణక్రియల భావనచే సిద్ధింపవలసిన దని యభినవగుప్తపాదాచార్యప్రభృతులచేఁ జాటఁబడుచుండు రస మసహింపఁగొనఁబడుచుండెడి యనుకార్యుల భావనచే.

---

* బ్రాహ్మణుఁడు బౌద్ధులలోఁగలసినను బ్రాహ్మణశ్రమణకుఁ డనఁబడువారఁట, ఇప్పుడు బ్రాహ్మణులు పెద్దలైనవారు క్రైస్తవులయినను వెనుకటి కులములతో వాడఁబడుచుందురు.

నెట్లు సహృదయుల సిద్ధించును? నీచజాతులవారికిమాత్రము భావములు, రాగాదులు లేవా? అవి పావనములు కావా? అందురు భావము తెచ్చుటఁ గల్గినను బవిత్రము లేకాని బూతు లుతిట్టుకొనునప్పుడు కూడ నాయికా నాయకులును, శృంగార చేష్టలును దోఁచుచుండును. అంతమాత్రమున నచ్చట రసము సిద్ధించుననుట గలదా?

కేవల విభావాదులే కాక విభావాదులను దెల్పెడు పదములును జుగుప్సావహములు కాక గుణాలంకారరీతులచే రమణీయములును, సముచితములును గానలెను. ప్రసంగ ములు మోటుగ నుండఁగూడదు. దిన్యాకరణక్రియలను మనో జ్ఞములు కావలెను. అట్టికావ్యముల వలననే రసములు నిష్ప న్నము లగునని రసవేత్తల సిద్ధాంతము. మాడుండు

'కన్యే కామయమానం మాం న త్వం కామయసే కథం'

ఈశ్లోకమున నర్థము గ్రామ్యము కాన రసము గల్గ దని చెప్పి,

'కామం కందర్పచండాలో మయి వామాక్షి! నిర్దయః,
త్వయి నిర్మత్సరో దిష్ట్యా ....'

అను శ్లోకమును రసవదలంకారమున కుదాహరణము చేయఁబడెను. మొదటిశ్లోకమున విభావాదులు లేవనియు, రెండవశ్లోకమునఁ గలవనియుఁ జెప్పవలనుపడదుకదా. ఇఁక భేదమేమి? అం దర్థము చేటలో వెలఁగకాయలవలెఁ గన్పట్టి మోటదై రసస్ఫూర్తిని జెడఁగొట్టినది. రెండవపద్యము నాతి

గూఢమై ధ్వనిమూలమునఁ గన్పట్టుచు హృద్యమై రసమును బోషించినది. కావున గ్రామ్యములై యసహ్యించుకొనఁ దగినమాటలు, నర్థములును రసప్రతిబంధకములని యొప్పుకో వలెను. కాని యొకమాట మిగిలియున్నది. 'ఎప్పుడో అసహ్యించుకోఁదగినవై వ్యవహర్తలనుబట్టియో, వాని య భాగ్యమునుబట్టియో ఉండును గాక. ఇప్పుడు పెద్దల వాడుక లోనికి రానోచుకొనియు వస్త్వాదు ప్రభృతుల కేల హేయత? అని.

దానికి వేరుసమాధానము తోఁచదు గాని యొకప్పు డు హేయములని వదలఁబడి చిరకాలమునుండి కవులయాదర మునకుఁ బాత్రములుగ్గాని కతమున నవి నీచపాత్ర సాహ చర్యనియమము గలిగి జుగుప్సాచిహ్నములుగఁ దోఁచి నీచాతి నీచవ్యక్తులనే మన కన్నులఁ గట్టినట్లు చూపును. దాన రస భంగ మందురు. వాచ్య వాచకములయం దమావశ్యకము కానిచో అభినవకవితలలోఁగూడ ప దువెన్నెలలను, ఇసుక తిన్నెలను, తీగలను, కోయిలలను, చిల్కలను, చివుళ్లను ఏల వర్ణింతురు? పెద్దనాదులు "తావుల్ కేవల"; 'తనశృంగార,,; ఇత్యాది పద్యముల నిట్లేల రమణీయ వస్తుసృష్టి నొనర్చిరి! నాగజెముళ్లు, వెంపరికలతుప్పలు, పేఁడకుప్పలు, గుడ్డపేలికలు చీపురుకట్టలు, శ్మశానములు, పాకిదొడ్లు మున్నగు వానిని పద్య ములలో వర్ణించి తమ గ్రంథములకు వన్నె తెచ్చుకోరాదా? అందఱును రమణీయవస్తుసామగ్రియే సారస్యనిదానము.

చూడుఁడు. రమణీయార్థప్రతిపాదకశ్శబ్దః కావ్యమ్ అని పండిత రాయ లనెను.

రమణీయవస్తుజాతము స్వతస్సిద్ధముగఁ గథలో లేనపుడు కొందఱు కవులు ప్రౌఢోక్తులతో నతిశయోక్తిమూలమున నౌపచారికమర్యాద ననుసరించి శబ్దమాత్రవేద్య వస్తువుల నందముగ సృష్టించుకొని వర్ణించి తాముతనిసి పాఠకులం దనుపుదురు. ఈమార్గమున భవభూతి మురారి ప్రభృతులు మార్గదర్శకులు. వారినుడికారములఁ ద్రావి యానందాకాశమున విహరించు వాగ్విదులుం బెక్కురుగలరు.

రససిద్ధి రసికునిబట్టియుండును. గ్రామ్యభాష యెవ రసహ్యించుకొనరో యెవరట్టిమాటలవాడుకతో నుందురో వారికా గ్రామ్యభాష శబ్దములచే రసము గల్గుటకుఁ బ్రతిబంధకము లేదు ప్యాక్టరీ కూలీలు, పడవలవాండ్రును, బండ్లునెట్టువారును బూతుమాటలకీర్తనలను ఒడుపుగాఁ బాడుకొనుచు నానందాంబుధిమగ్నులై మేనులు మఱచి తమశ్రమ నెఱుఁగని స్థితిలో నుండి యెంతంత లేసి భారపు పనుల నేని జేయుదురు. వారికి రసానుభూతి లేనిచో శ్రమ తత్కాలమున వారి కేలకన్పట్టదు?

ఆమాటలు పౌరులకును, గ్రామములలోని పెద్దమనుష్యులకును అసహ్యించుకొనఁ బడునవిగ నుండు. అట్లు లేవగించుకొనుచున్నవారి డెందములకు నిర్మల రసానుభవ మెట్లు కలుగు? వీ రేమాటల నసహ్యించుకొనరో అట్టిబానతో వీరికి రసము సిద్ధించు.

ఇంతకన్న గొప్పనాగరికులు ప్రభువులు మున్నగువారికి సామాన్యపౌరుల వేషములును జుగుప్సావహములే. కావుననే మనకవులు ప్రౌఢోక్తులనైన పెల్లవారికి నచ్చు గొప్పపాత్రల నెవిభావాదులుగాసృజించి రాజాధిరాజులకును రసానుభవము కల్గునట్లుకబ్బములనల్లిరి. అట్టిశైలి నిప్పటివారు నాయికా నాయకులు గొప్పయిండ్లవారే కావలెనా? పల్లెల పిల్లలు పనికి రారా? అని యీసడించుచున్నారు. అను కార్యులు పెద్దతర గతివారైన చిన్నతరగతివారి రసోదయమునకు భంగముండదు. అనుకార్యులు చిన్నతరగతివారైనఁ బెద్దతరగతివారికి రసానుభవము దుర్లభము కావచ్చు. ఏలయన అనుకార్యుల వేషభాషలు తమకునచ్చక యేవగించుకొనుచుండు కావ్యపాఠకులకుఁ గాని, నాటకద్రష్టలకుఁ గాని లౌకిక తాత్కాలిక జుగుప్స యలౌకికరసానందానుభవమునకుఁ బ్రతిబంధకము కాదా?

,చతుర్వర్గ ఫలప్రాప్తిః సుఖాదల్పధియామపి,

అనుచో సాహిత్యదర్పణము కావ్యనాటకాదులు సుకుమారమతులగు రాజకుమారాదులకే యని చెప్పెడిని. అట్టియెడ నధికారులగువారికే సరసప్రబంధము లుపయోగింపవ గును. కాని, ప్రభుసమ్మితవాఙ్మయముచేతను, మిత్రసమ్మిత గ్రంథమండలిచేతను వినేయులగు లాతియధికారుల కీకావ్యనాటకాదుల వినయాధాన మేల?

చిన్నతరగతి జనుల రసానుభవమునకుఁ జిన్నతరగతి యనుకార్యులకథ లుపయోగించుటయుఁ, గొన్నిచుట్టుపాటువలు

మొదలైనవి లేనిచోఁ బెద్దతరగతి సహృదయులకుఁ గూడ నవి రంజకము లగుటయుఁ గలదు. కాన లోకసహజ ప్రకృతిలోల మగు రసికహృదయమును దన్నుపట కట్టి కథలతో సైతము పుస్తకములు సృజింపఁబడుట యుక్తమేయైనను బ్రాచీనకవులు సర్వసామాన్యముగా రసోదయమునకు గొప్పప్రాతలనే యను కార్యులఁ జేసి పొత్తముల నుత్తముల వెలార్చుటయు నవి చారకార్యము కాదు.

## వ్యాకరణ బాహుళ్యము.



వ్యాకర్తలు సైతము పూర్వసూత్రకర్తల మార్గము లఁ దెలిసికొన్ని లాఘవప్రధానములుగ వ్యాకరణములను సూత్రీకరించి సుబ్యార్థుల వృథావ్యాసంగభారమును దగ్గింపవల యును. దీనికై పూర్వులగు నాంధ్రభాషావ్యాకర్తల ధోరణు లెట్టివో, స్వపాండిత్యప్రకటనకుఁ గాక విద్యార్థిజనోపకృతికై భాషాప్రవేశసౌలభ్యమును బ్రాచీనవైయాకరణుల వ్యాకరణ ప్రణాళిక లెట్లు సాధించెడినో, తెలుపుచు వ్యాకరణబాహుళ్య మును గూర్చి కొంచెము పరిశీలింతము.

విద్యార్థి యనేకజ్ఞానములను సంపాదింపవలసియున్నాఁ డు. అన్నిజ్ఞానములు నొకబాసలో నమకూరుట దుర్లభము. కావునఁగొన్ని బాసలను విద్యార్థి నేర్చికొనవలయును. ప్రస్తుత

వ్యాకరణ ప్రాముఖ్యము.

ము మనవిద్యార్థికిఁ గావలసిన జ్ఞానములు సమకూరుటకై సంస్కృతము, తెలుఁగు, ఇంగ్లీషు, హిందీ అను భాసలు నాలుగును తప్పక రావలసినట్లు చెప్పుచున్నారు. అట్టియెడ నొక్కొక్క భాసలోఁ బూర్ణప్రవేశము కలుఁగుటకుఁ జాలకాలము పట్టును. అట్టి భాస వచ్చుటకు సాధనము వ్యాకరణము. ఆవ్యాకరణము కొద్దిగా నుండి భాసకు మార్గదర్శిగా నుండవలెను. వ్యాకరణము లేని భాస నేర్చుకొనుట యరిది. వ్యాకరణము నేర్చుకొనక నాలుగు సంవత్సరములకు సాధించెడి భాషను వ్యాకరణముతో విద్యార్థి రెండేడ్లలో సేకరింపఁగలఁడు. భాషానియమరహస్యమును బహుభాషాశోధన లభ్యమువ జిన్నసూత్ర మొకటి కరతలామలకముం జేయగలదు. భాషలో నర్థనిర్ణయము సేయుటకును వ్యాకరణ మూఁతకఱ్ఱ. కావున నే వేదార్థనిర్ణయసాధనముగ నుండెడి వ్యాకరణమును వేదమునకు రెండవ యంగముగాఁ బెద్దలు పరిగణించిరి. వ్యాకరణమను పదమునకు వివరించునది యని యర్థము. భాసను వివరించి విద్యార్థికిఁ జూపునది కనుక నే దీనికీపేరు వచ్చినది, ఇంగ్లీషుభాష వ్యాకరణముతోడ నే నేర్పబడుచున్నది. కావున నది తొందరగా బాలురకు వచ్చుచు మాటాడుటకును వ్రాయుటకును బనికివచ్చుచున్నది. సంస్కృతమును మనము పిల్లలకు వ్యాకరణము లేకుండ నేర్పుచున్నాము. కావున నే ఏడాఱేండ్లకుఁ బంచకావ్యములు నాటకములు చదివి యొకవాక్యమయినఁ దప్పులు లేకుండ వ్రాయలేనివారును, ఒకగంటయేని స్వే

## కావ్యనాటకాదిపరిశీలనము.

యీవ్యవహారము మాటాడుటకో లేనివారునునై యేకవచనము నకు బహువచనము చెప్పలేని విద్యార్థులు కొందఱు తేలుచున్నారు. దీనివలన వ్యాకరణము బాసవచ్చుట కెంతముఖ్యమో తెలియఁబడెడి. కాని యేబాస వ్యాకరణమైనను ఆ బాసలోఁ బ్రవేశము రూఢమగునంతవఱకే నేర్పఁబడును. సంస్కృతమున మాత్రము భాష వచ్చినతర్వాతఁ బ్రారంభింపఁబడి అది ప్రత్యేకశాస్త్రముగ నేర్పబడుచున్నది. ఆ సంప్రదాయమును దెలుఁగులోనికిఁదీసికొనివచ్చి వ్యాకరణపుఁబొత్తములను బండ్లమీఁదఁ దోలింపవలయు నని యహోబలపండితుఁడు కొంత త్రోవత్రొక్కియున్నాఁడు. ఏ నన్నయభట్టీయమునో పరమప్రమాణముగఁ బాణినీయమును సంస్కృతమునకుఁ బెట్టుకొనినట్లు పెట్టుకొని, ఆసూత్రములచేతనే భూతవర్తమానకాలములందలి భాష నెల్ల సమర్థింపఁ బూనితిమేని యాంధ్రవ్యాకరణములోఁగూడ భాష్యములును, పరిభాషేందు శేఖరములును శబ్దేందు శేఖరములును బుట్టవలసియేవచ్చును. ఎప్పుడును బెరుగుచుండెడి వాడుకబాస కావున దీనికిఁ బ్రతిశతాబ్దియందును వ్యాఖ్యానములు వ్రాయవలసి వచ్చుచునే యుండును. కాని యిట్టి వ్యాకరణబాహుళ్యము తెలుఁగుబాసకు మనము కోరుకోఁదగ్గది కాదు. ఈశుష్కన్యాసంగములోఁ బరిశ్రాంతులైన విద్యార్థుల కైహికాముష్మికపారమార్థికవిజ్ఞాన సంపాదనలందు విసువు గలుగుట మనకుఁ దీఱని యాపద.

## వ్యాకరణ బాహుళ్యము.

వ్యాకరణ లాఘవమునకుఁ బూర్వులు త్రొక్కిన దారులు

1. చిన్న చిన్న సూత్రములతో గొప్పయంశములఁ జెప్పుట

2. ప్రసిద్ధమగు ప్రాయిభాషకే వ్యాకరణము వ్రాసి విశేషములఁ బ్రయోగజ్ఞానమునఁ దెలిసికొనుఁడనుట.

3. సామాన్యముగ జనులవాడుకలోఁ గల్గెడి తప్పులనుమాత్రము సవరించుచుఁ జెప్పుట.

4. గొప్పగొప్ప భాషాసంప్రదాయసిద్ధాంతముల నొక్కొక్కమాటతో ధ్వనింపఁజేయుట.

5. ప్రాచీనవ్యాకరణములు చెప్పని యంశములనే వివరించుట.

ప్రాచీనవ్యాకరణనిర్మాతల కెల్ల వ్యాకరణబాహుళ్య మిష్టము లేదనుటకు వారి సూత్రనిర్మాణ మొకసాక్షి. సూత్రముల రచించిన పాణిన్యాచార్యులవారు మఱింత లాఘవమును గోరి యనువృత్తుల పద్ధతిఁ బెట్టుటం జేసి సూత్రముతో వృత్తి వల్లింపవలసిన యావశ్యకత గల్గి లాఘవమును మించిన గౌరవము వచ్చిపోయినది. సూత్రపాఠ మంతయు నష్టాధ్యాయి వరుసన వల్లించినవారికైనను ముందు సూత్రము స్మృతికిఁ దట్టునుగాని వెనుకటిసూత్రము తట్టదు కాన వెనుకటి సూత్రములనుండియే తలఁచుగఁ దెచ్చుకోవలసి యుండెడి యనువృత్తులు వృత్తి రానిచో స్ఫురించుట లేదు. కావున నత్యంతలాఘవము నపేక్షింపక యేసూత్రమున నాసూత్రపదములతో నన్వయము పూర్తి యగునట్లుండుట వ్యాకరణ

లాఘవమునకు గొప్పహేతువు చాలవఱకు నన్నయభట్టార కుని సూత్రము లీతీరున నె యుండును. కొన్ని సూత్రము లను స్పష్టప్రతిపత్తికై గౌరవమును సహించి రచించెను. 'భూయఉభయా.' లాఘవాపేక్ష మితిమించి తల పగులఁగొట్టి నను అర్థముగాని సూత్రాలువ్రాసి భాష్యాలకును వ్యాఖ్యానాలకును దారి చూపుట లఘూకరణము కాదుకదా! వ్యాకరణము లఘువుగ నుండుటకై నన్నయతొక్కినత్రోవలలో నిదియు నొకటి.

మఱియుఁ "ప్రాయికనిత్యప్రయోగలక్ష్మ" అనుమాటలచే సుప్రసిద్ధులగు మహాకవులు పలుచోట్ల వాడెడుప్రయోగములకే వ్యాకరణము గాని దారితప్పి యెక్కడనో ఒక్కచోఁ బ్రమాదికముగఁ గాని జాతీయపదప్రీతితోఁ గాని లోకోక్తిలోలతతోఁ గాని వాడినపదములకు వ్యాకరణము వ్రాయఁబని లేదనియుఁ జాటుపద్యములలోఁ బ్రాస్తావికపద్యములలో మహాకవులు వాడియున్నను గ్రంథస్థములు కానియట్టివాని కెల్ల వ్యాకరణ మనావశ్యక మనియు సూచన గన్పట్టెడిని—ప్రాయికము లనఁ దఱచు వాడఁబడినవి నిత్యము లన గ్రంథస్థములై చాలకాలము నిల్చునవి.

కొన్ని శ్రీనాథాదుల చాటువులుకూడ చిరస్థాయితను గాంచినవి. కాని వానిని రచించునపుడు కవి గ్రంథస్థప్రయోగములయెడ నున్నంతటి దోషభీతితో నుండఁడు కాన వాని లోనిప్రయోగములనుబట్టి వ్యాకరణముల రచించి యాదారిని

రహదారిని జేయుట నన్నయకిష్టము లేదు. కావుననే అథర్వణుఁ డమున్న గువారిట్టి దిద్దుటకు వీలు కలిగినది. "నః కా" అని సూత్రమున్నది. వెదకఁగా వెదకఁగా "నిషధేంద్రుబచ్చురుక్, ఉత్సవము కేగు, అండజాధీశ్వరుకొసఁగ, నగుబాటుకోర్చి" అను నిట్టిప్రయోగాలు కన్పట్టినవి. ఐనను నగాగమసహితములకుఁ బ్రయోగసమృద్ధి గలదు కాని యితరములకు లేదు. ఇట్టిదిద్దుఁ బాటులు కొన్ని తరువాతి కవులనాఁటి వాడుకలునుండుటచేఁ గలిగినవి. అదిసహజమే. వారినాఁడే విరుద్ధములైన ప్రయోగ ములుండునెడ వారిప్రాయికనిత్యప్రయోగలక్షణ పక్షపాతమే అట్టియుపేక్షకుఁ గారణమై వ్యాకరణలాఘవమున కుపకరించిన దనుకోవచ్చును.

మఱియు "అద్దంత్యాస్తాలవ్యశ్చుగ్వాక్రిస్యాన్మిథస్స వర్ణశ్చ" అని సూత్రించెను. చజలకు అఆ ఉఊ ఒఓఔలు కల సినప్పుడు దంత్యంత గలుగుచుండ, అకారముతోఁ గూడిన చ జ లు దంత్యములనెను. ఇ ఈ ఎ ఏలం గూడి చజలు తాలవ్యము కనెను. ఇది తెలియక చెప్పె ననుట హాస్యాస్ప దము. ఇట్లు చెప్పుటచేత నీయనరచనాపద్ధతి యొకకొంత తెల్ల మగుచున్నది. జనుల కుచ్చారణమునఁబొరపాటెక్కడఁ గలు గునో అక్కడనే సవరణలుగ వ్యాకరణము వ్రాసెను గాని "వాఁడు" అను పదములో నకారమున కొకసూత్రము, డుకు మఱొకసూత్రమును వ్రాసినట్లు వ్రాసి ప్రక్రియను బెంచి యుండలేదని దీనిచే దెలియఁబడును. ప్రౌఢవ్యాకృతిలోని

సర్వనామప్రక్రియ యిట్టిది కాదు. జాణజడ, మొదలైనపదాలను దాలవ్యయుక్తములుగ వాడుట యిప్పటికి మాయని వాడుక యైయున్నది. చేప, జేన, చేద చేట మొదలైనవి A కు సరి పోయెడి యాకారముతో నుచ్చరించుట యిప్పటికిం గలదు. "చెలువులసాకిరి చాయమగఁడు" అను యతి యిట్టిదోషమున నేమో గర్తై వీనిసవరణ సూత్రమే చేయనెంచి కడమయచ్చులని సవరణయావశ్యకము కామి వానిపొంతకు నన్నయ పోలేదు. "సర్వత్రాజ్వాత్పూర్వ్యంజ్ఞేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః" అను సూత్రముసైత మిట్టి సవరణకే యేర్పడిన ట్లున్నది. "అద్యఃక్రియాసు" అను సూత్రముచేత నథర్వణాదులవలెఁ బ్రిజయుచ్చారణమును ద్రోసిపుచ్చక ఇతఁడు అతఁడు మొదలైనవానిని యకారాదులగానే తీసికొని వానికి సంధిలోవైరూప్యము రాకుంటకు యకారదృష్టిని నిరసించుచున్నాఁడు. యతఁడు అనుకొను రోజులలో వచ్చును యెతఁడు=అను పదములు కలపునప్పుడు వచ్చునెతఁడు అను గ్రాంథికరూపము నిష్పన్న మగునట్లైవఁడును సంధిచేయుఁడు కదా? మీఁదు మిక్కిలి వచ్చున్యేతఁడు అని గ్రామ్యసంధిని గూడఁ జేయును గదా? అట్టివైపరీత్యము భాషకు రాకుండఁ బైసూత్రము "సర్వత్రా" అనునది సవరణచేయుచున్నది. ఈ రీతి నన్నయ్యాదగుట తీరమైనచోఁ బరోపకారవరతతప్ప నన్నయయందున్నపాండిత్య ప్రకటనేచ్ఛ యశేషభాషారూపవివరణాగ్రహద్వారమునఁ గన్పట్టఁబోదు. ఆఘన సూత్రములు చేసిన

లక్ష్యము లెల్ల నిట్టివే యనుట కిప్పటియుచ్చారణము వీలు కలుగఁజేయుట లేదుగాని యప్పటి యుచ్చారణరీతి శాసన పరిశోధనవలనఁ దేలునేని అప్పటి యుచ్చారణము ననుసరించి యే సూత్రములను సవరణకుఁజేసెనో ఏసూత్రములను ప్రసిద్ధ ప్రయోగములకుఁ జేసెనో మనము తెలిసికోఁగలము. అన్నియు సవరణలకుఁ జేసినట్లు లేవు. కనుక నీసూత్రము నట్టిది కాదనుట న్యాయ్యముగ లేదు. చుట్టు, చుట్టాలు, జుట్టు మొదలగువానిని దంత్యములన టంట కితర కారణము గన్పట్టదు. నిరుడు శ్రీయుతులు జయంతి రామయ్యపంతులుగారు తెలిపిన దుష్టపూర్వుల నాలోచించిన బాసపరిణామస్వభావము లెల్లనై అప్పటి యుచ్చారణముల సవరణ చేసి సంస్కరించిన రూపములను శిష్టప్రయోగరూఢములను జెప్పుటకే యీసూత్రములు చాల నిర్ణీతము లేమో అని మాత్రమేల తలంపఁగూడదు? తత్సమభాషకే యెక్కువగ వ్యాకరణము వ్రాసి యాచ్ఛికభాషకుఁ గొంఁదిగ వ్యాకరణము వ్రాసి యాగుట కలపేక్షిత గ్రంథ నిర్మాణ రుచియే కారణ మనుచున్నాను. నన్నయభారతమునఁ దత్సమములు మూఁడుపాళ్లును, ఆచ్ఛికములు మొక్కపాలును నై యున్నదికదా! అప్పటి గ్రంథములవాడుక యెల్ల నిట్లు శిష్టసమ్మతింబడయుచున్నట్లు మన మూహించుకొనుటతప్పుకాదు. ఇట్లుండఁ బొత్తముల వాడుకలో నెక్కువగ లేని యాచ్ఛికమునకుఁ బ్రక్రియాసమృద్ధితో వ్యాకరణములు నింపుట వ్యాకర్తలకు నంస్కార్యమైన గ్రాంథిక భాష కుప

యోగించిచిక పని కాదు, కావున నిది వదలి తత్సమువిచారణ ను ముఖ్యముగఁ జేసెను. ఇయ్యాదియు వ్యాకరణము కొద్దిసే యురీతులలో నొకటియే.

మఱియుఁ గొన్నిచోట్ల సూచనలతో గొప్పవ్యాసము వ్రాయఁదగ్గయంశములను ధ్వనింపఁజేసి "సూచనా తూస్త్రతమ్" అనునార్యోక్తికి సార్థకముఁ జేసెను.

అట్టివానిలో "ప్రవాహినీ దేశ్యా" అను నుడి యొకటి. ప్రవాహమునఁ బ్రాంతనీరే యెప్పుడు నుండదు. ప్రాంతదిపోవం గ్రొత్తది వచ్చు. అదియుంబోవ మఱొకటి వచ్చు అట్లే యే కాలమున కెయ్యది వాడుకలో నుండి మహాకవి ప్రయోగ ములలోఁ జేరుటచే నిర్దోష మనిపించుకొనుచుండునో, అట్టి జాను తెలుఁగే మిక్కిలి రసభావాదుల ధ్వనింప జాతీయమై లోకోక్తులై నామెతలై పొలుపారుచుండు. నిజమున కీసూచ న ననుసరించియే కవిలోకయాత్ర జరుగుచున్నది. ఏకవి తన కాలములోని క్రొత్త జాతీయభావను, క్రొత్తలోకోక్తులను వాడుకొని రసభావ పోషణము నొనర్ప లేదు! ఏకవి గిఱి గీచిన ట్లు రేఖామాత్రమునైన నతిక్రమింపక ప్రాచీనకవిప్రయోగ పారాయణముతోనే కాలము గడపియుండెను! పొంటె, తొట్టి, మెట్టువనీకా, మొదలైన యిట్టి పదములచేత నేకవి యిప్పుడు ప్రసాదగుణమును ద్రాక్షాపాకమును జాతీయభావలో నిమి డింపఁగలఁడు! కాన యిట్లు ఒప్పుకొని కొందఱును, ఒప్పుకొన క కొందఱును సర్వథా కార్యపథమున శిరసావహించు పద్ధతి

## వ్యాకరణ బాహుళ్యము.

నొక్క పదముతో ''ప్రవాహినీ''అని సూచించుచు వ్యాకరణమును
నెంత లఘువు చేసెనో మనము గమనింపవలెను. కేతన య
చ్చతెలుఁగు వేఱునేత యిట్టి యాశయముతోడనే యనుకోవ
చ్చు. మఱియు ''సంకేతితసుప్రసిద్ధమేవ పదం'' అను చోటఁ బ్ర
కృతవ్యవహారములోనుండి మహాకవి ప్రయుక్తమైనవే వాడవ
లెను గాని పాంటువంటిపదాలు వాడఁగూడ దనుచున్నాఁడు
ప్రసిద్ధము--కవిప్రయుక్తము. ఇట్లనుటచేతనే సంకేతిత మను
నర్థము వచ్చె. సంకేతితము గాని దానిని మహాకవులు వాడరుక
దా! ఇట్టియెడ సంకేతిత మనుట యెప్పుడును భాష ప్రజలసం
కేతమునకు గోచరమై యుండవలె నని యాచార్యాశయమై
యుండునోపు. అనఁగా అందఱికిని వినుటతోడనే యీపదా
నికీయర్థమని నిఘంటువులుతిరుగ వేయకుండను, బొమ్మలు
మఱుఁగ నిఘంటువులు వల్లింపకుండను తెలియవలె నను నా
శయముతో.సంకేతితయనెననుకోవలెను.అచ్చ తెలుఁగురామా
యణమునఁదత్సమములనుజొరనీమియనుగొప్పనియమముఁబెట్టు
కొనియుఁ దిమ్మకవి యీసదాచారపాలనమునకే ప్రసాద
మును బోషించె. అథర్వణాచార్యులవారును వ్యాకరణలాఘవ
మున కొకమంచిదారి చూపిరి. తెలుఁగు వాడుకభాష కాన
సంస్కృతమువలె నాఁగిపోవునది కాదు. కాన యెప్పుడును
వ్యాకరణములు పుట్టుచుండవలెను.అట్టివ్యాకరణములలోఁ బూ
ర్వవ్యాకరణోక్తములు పదియేనుపాళ్లును, తమది యొకపాలు
గను వ్యాకర్తలెల్ల వ్రాయుచున్న గ్రంథములూరక పెరిగి

పోవును. అట్లు గాకుండ పూర్వులు చెప్పని దానినే క్రొత్త వ్యాకర్తలు వ్రాయుచుండిన గ్రంథము లఘు వగును. నేర్చు కొనువారికి సౌలభ్యము గలుగు. ఇట్టిపద్ధతిని దాను నిర్మించి నడచి, పునరుఁ జూపించినవాఁడథర్వణాచార్యుఁడు. నన్నయ భట్టీయమున నేవి చెప్పఁబడలేదో వాని నెల్లఁ బూస గ్రుచ్చి నట్లు చూపుచుఁ బునరుక్తి లేశ మయినఁ దననుడికారము నంటకుండఁ గారికలను వ్రాసి తెల్గును బోషించినతండ్రి యథర్వణముని. ఈ కారికలలో నన్నయోక్తముల కనువాద ములుగనుండినవి యన్నియుఁ బ్రక్షిప్తము లని యథర్వణ కారి కల యుపోద్ఘాతమున శ్రీపర్ఘుల చినసీతారామస్వామి శాస్త్రిగారు నిరూపించినారు. కాన అథర్వణుఁడు చూపిన లఘువ్యాకరణనిర్మాణరీతి మనము నేర్చుకోఁదగ్గదిగ నున్నది.

వ్యాకరణములు బొసను సాంతముగ నియమింపలేవు.

నూతనభావప్రోద్దీపకములగు శబ్దము లెల్లప్పుడును దేశ భాషాప్రవాహములఁ బుట్టుచుండును. అట్టిపదములు భాషాసౌభా గ్యవేత్తలగు సహృదయులచేఁ బొత్తములం బ్రవేశపెట్టఁబడి విజ్ఞానుల యామోదములచే గ్రాహ్యములగు. "సోఽర్థ స్త ద్వ్యక్తిసామర్థ్యయోగీ శబ్దశ్చకశ్చన" అని ధ్వనికర్త. నన్నయ, అథర్వణుఁడు, వెల్లంకితాతంభట్టు, ఎలకూచి బాలసరస్వతి, ముద్దరాజురామన్న, అప్పకవి, అడిదము సూరకవి, కస్తూరి రంగకవి, కూచిమంచితిమ్మకవి. శిష్టు కృష్ణమూర్తిగారు, చిన్నయసూరి, బహుజనపల్లి సీతారామాచార్యులు మున్నగు

ప్రాచీనవైయాకరణు లెన్నెన్నిసూత్రాలు వ్రాసినను భారతి ములోని ప్రయోగము లే నిశ్శేషముగ సాధింపఁబడుటలేదు. ఇతరకవుల కొంతిత్తభాషను గూర్చియు నిప్పటి యభినవభాష లనుగూర్చియు నేమి చెప్పవలెను?

కావున వ్యాకరణములు భాష నంతను నియమించి చూపుట కేర్పడ వనియు భాషాప్రవేశమునకు దారి చూపు నవి యనియుఁ దేలుచున్నది.

ఈయంశమును ,,పర్యాప్తో మన్మతేతు సంకేతః'' అనుసూత్రిముతో నన్నయాచార్యుఁడు సూచించెను. దీనికహోబలపండితుఁడు ,,శాస్త్రస్య దిక్ప్రదర్శనార్థత్వాత్, యత్సం కేతితం శిష్టప్రయోగారూఢం చపదం,తత్ప్రయోజ్యమిత్యత్రా స్మాక మభినివేశః,, అని వివరించెను. మఱియు నహోబల పండితుఁడు స్వయముగఁ గూడ ,,ఆద్యప్రకృతేరపి ప్రయోగా నుసారిత్వ మేవ,, అని,,బోధయేత్కియదుక్తిజ్ఞో మార్గవిత్సహ యాంతికం, ప్రమాణ మకలంకస్య పూజ్యపాదస్య లక్షణమ్,, అను ధనంజయవచనమును బ్రమాణముగఁ జూపి తెలుఁగు ప్రయోగానుసారి యని యేమిచెప్పవలె ననినాఁడు. కైముత్తిక న్యాయముగా నథర్వణాచార్యులవారును ,,భాషేయ మమితా తత్ర దేశ్యాచిత్రస్వభావయుక్, తచ్చిత్రతాతు ద్రష్టవ్యా పూజ్యపాదనుభాషితైః,, అనుచోఁ బ్రయోగముల వలన నే భాషాస్వరూప మశేషముగఁ దెలియఁబడును గాని వ్యాకరణమువలనఁ గాదని తెల్పెను. వ్యాకరణమును గూడ

వ్రాసెం గాన బాలకు దిక్ప్రదర్శనము సేయునవి వ్యాకరణ లని యథర్వణాశయము వ్యక్తము.

చిన్నయసూరిగారును "రేఫంబులును లఘ్వలఘువులుం దక్కుంగల విశేషంబులు నార్యవ్యవహారంబులం దెలియుట శ్రేయంబు," అని రేఫఱకారనిర్ణయమునకై కూచిమంచితిమ్మకవి అప్పకవి మున్నగువారు చేసిన యెత్తికోలును సైతమీసడించుచున్నాఁడు. ఇతరు లక్షరమున కక్షరమునకును బ్రక్రియాసూత్రములను వ్రాసిన యాచ్ఛికసర్వనామములకు శబ్ధమంజరిగా వ్రాసి చూపిన సూరిగారికి వ్యర్థవ్యాకరణకల్పన మిష్టముకాదని వేఱుగఁ జెప్ప నేల?

## ద్రౌపదిరోషము, వ్యాసుఁడు—తిక్కన.



శ్రీకృష్ణుఁడు సంధికిఁ బోవునప్పుడు వ్యాసరచనలో పాండవులెల్లఁ దమయభిప్రాయములను జెప్పినపిమ్మట ద్రౌపది సాత్యకి సహదేవుల శూరాలాపములను మెచ్చుకొనుచు భీముని శాంతిని జూచి మిగులఁగినియుచుఁ గద్గదయై యశ్రువులు నిండ శ్రీకృష్ణభగవానునితో నను మాటలలో ముఖ్యము లివి. "ఏమియు నీయని సంధి నొప్పుకొనవద్దు సృంజయసహితులై పాండవులు వారిని గెల్వఁగలరు సామదానములచే సాధింపఁదగినది వారి

యెడ లేదు. వారియెడఁ గృప నూపవలదు. సామదానము
లచే సాధ్యులుగానివారిని దండించుట జీవితము గాపాడుకొ
నువారికి ధర్మము. నీవును పాండవులును గలసి యుద్ధము సేయు
టయుక్తము. సర్వక్షత్రియసుఖావహము. లోభాక్రాంతు
లైన క్షత్రియులను, దదితరులను గూడ క్షత్రియుఁడు హత
ము సేయవలె. చంపఁదగినవానిని జంపకపోవుటచేఁ గల్గుదోష
ము, చంపఁదగనివానిని జంపినదోషమువంటిదే. నా దుఃఖము
ల నీ వెఱుఁగుదు. దాసినైన నేను ధృతరాష్ట్రునకుఁ గోడల
నుగా జాలను భీమార్జునులు కృపణులై సంధిగోరి రేని వృద్ధు
డైన మాతండ్రి మహారథులైన పుత్రులతోవచ్చి పోరఁగలఁడు.
నా యేవురు కొమరులు మహాబలు లభిమన్యుని ముందుంచు
కొని కౌరవులతోఁ బోరుదురు.

"పదుమూఁడేండ్లు కోపము లోనిడుకొని నిరీక్షించితి.
ఇప్పుడు ధర్మము నే చూచుచున్న భీముని వాక్ఛల్యముచే
హృదయము బ్రద్దలగుచున్నది" ఇట్లని బాష్పసన్నకంఠముతో
నెలుంగు దొట్రుపడ వడకుచు క్రిక్కిరిసియున్న వక్షోజయుగ
మును గన్నీటితోఁ దడుపుచు నేడ్చెను. లోని వేఁడి ద్రవీభవిం
చెనో యన వెచ్చని కన్నీరు గారుచుండె.

ఈ ప్రసంగమున ద్రౌపదిని శ్రీకృష్ణపాండవులకు
ధైర్యముఁ జెప్పుదానిగను, కౌరవులను జంపుడని స్పష్టముగా
జెప్పుచున్న కుపితచిత్తురాలినిగను, కోపాతిశయముచే భర్తలను
దృణీకరించుచున్నదానిగను, దుర్యోధనదుశ్శాసనులను రణాఘ

తులను జూడకపోతినని మహాతాపముం బొందుచున్నదానిని గను వ్యాసుఁడు చూపెను.

తిక్కన యీద్రౌపదిని జాల మార్చివేసినాఁడు. ఈయన ద్రౌపది కోపమును గడు నిగూఢముగ వెల్లడించు చున్నది. పాండవులను అననట్లు అనుచున్నది. లోకమువారు తనభర్తలను బరిహసింతురేమో అను భయము తనకుఁగలిగి నట్లు పలుకుచు యుద్ధప్రోత్సాహమును జేయనట్లు చేయుచున్నది. "వారివలన గలిగినయవమానమువల ననాకుఁ బిచ్చియెత్తినది, నేను కాకులం ప్రేలుచున్నాను. నా మాటలు పాటింపక పాండవులయొక్కయు నీయొక్కయు సౌజ న్యమునకు భంగములేకుండఁ గార్యమును నిర్ణయించుకొనుఁ డు" అని యుపసంహరించుచున్నది. ఈ మాటలో నెంతటి ధ్వని యున్నదో చూడుఁడు. "లోకమ్మున సహనశీలురని కీర్తి సంపాదించుకొనుటకే నీవును బాండవులును యత్నించుచు న్నారు కాని నా బన్నములను గూర్చియు, నా దుఃఖమును గూర్చియు మీరేమియు గణనసేయుటలేదు", అని యెత్తిపొ డుచుచున్నది. ఇచ్చట వ్యాసుఁడు రసభావప్రధానకవిగను తిక్కన ఔచిత్యదృష్టియగు కవిగను గన్పట్టుచున్నారు. కోప మున్ భీముని శాంతిని సంధిప్రయత్నములను జూచుటచేతఁ బెచ్చుపెరిగి ద్రౌపదిని నవశురాలినిగాఁజేసి గాంభీర్యమును బాఱఁదోలినదని తెల్పుట కావెను లోపలఁగలభావమును స్పష్టముగా వెడలఁగక్కుచున్న యధీరనుగాఁ జూపినవాఁడు వ్యాసభగవానుఁడు,

## ద్రౌపదిరోషము, వ్యాసుడు-తిక్కన.

శుద్ధాంతముల నుండు రాజ్ఞికి సహజమైన గాంభీర్యము ను బోద్రోలక ధీరతను గాపాడుచు భావమును నిరుపమానముగాఁ బోషించినవాఁడు తిక్కనమహాకవి.

ద్రౌపదిబొమ్మను వేయుట మున్నుగువానిచేత నసామాన్యభావనిర్మాణదృష్టి వ్యాససూక్తులలో నగుర్పాటు గల్గించుచున్నది. రాణికి సముచితమైన భావసూచనాచాతురి తిక్కన నుడికారముల నాహా పుట్టించుచున్నది.

వ్యాసుడు.

ఉ. ద్రౌపది బంధురంబయిన కొప్పున్నడి గ్రమ్మన విప్పి
వెండ్రుకల్, దా వలచేతఁబూని యసితచ్ఛవిఁ
బొల్చు మహాభుజంగమో, నా విలసిల్లి గ్రేలఁగ
మనంబునఁ బొందు విషాదరోషముల్, గావఁగ
లేక బాష్పములు గ్రమ్మఁగ దిగ్గనలేచి యార్తయై.

వ. గోవిందు ముందటంబెట్టి యిట్లనియె.

క. ఇవి దుస్ససేను వ్రేళ్ళం
దవిలి సగము ద్రెవ్విపోయి దక్కినయవి కౌ
రవులకడఁ దీఱుమాటల
యవసరమునఁ దలఁపవలయు నచ్యుత! వీనిన్.

సీ. ఈ వెండ్రుకలు పట్టి యీడ్చిన యాచెయి
దొలుతగాఁ ఖోరిలో దుస్ససేను

# కావ్యనాటకాదిపరిశీలనము.

తను వింత లింతలు దునియలై చెదరి యా
పడియున్నఁ గని యాడు కాఱుఁగాక
యలుపాలఁ బొనుపడునట్టి చిచ్చే యిది
వైనుగద పట్టిన భీమసేను
బాహుబలంబును బాటించి గాండీవ
మను నొకవి ల్లెప్పుడును వహించు

తే. క్షత్త్రి విక్రమంబు గాల్పనే? యిట్లు బ
న్నములువడిన ధర్మనందనుండు
నేను రాజరాజు పీచుంగుఁ గన్నారఁ
గానఁ బడయ మైతి మేనిఁ గృష్ణ!

ఉ. నెట్టన ఇట్టియల్క మది నిల్పితి రక్కసితాల్మిఁ జి
చ్చొచ్చెడిం, గట్టినయట్లు పెద్దయును గాలము దీనికి
నారు చున్నఁడుం, బుట్టదు దుష్టనిగ్రహము పూని
జగంబులు గాచునట్టితోఁ, బుట్టువు నీవుఁ దేజమునఁ
బొల్చిన భర్తలుఁ గల్గ నచ్యుతా!

ఉ. అంతలు సేసి పోనడచి యక్కట ! సంజయుచేతఁ
జెప్పిపు, త్రెంతు రే? యిట్టియూఱట మదిం బ్రియ
మందె యుధిష్ఠిరుండు దా, నంతన యూళ్లు లేవు రకు
నైదు సుయోధనుఁ డిచ్చు నొక్కొ! యీ, కంత
కృపావిహీనమతి నాతఁడు నొంచునె యన్నదమ్ములన్?

ఈ పద్యమున 'అన్నదమ్ములన్' అను మాట ద్రౌపది కసిని అపారముగాఁ దెల్పుచున్నది.

## ద్రౌపదిరోషము, వ్యాసుఁడు.

### తిక్కన.

చ. తన మనువడ్డబన్నములు దమ్మునిపైఁ గల కూర్మి
పేర్మి నీ, జనపతి సైఁపకున్నె? అది సక్కన రాజ్య
మంపాలు లేనితీ,రున కోడఁబాటుగల్గిన నెఱుంగమి
పెట్టరె? చాలరైరి వీ, రసరోళా! నానలేమి యని
యాడరె? లోకము వారు కేశవా!

ఈపద్యములో 'తమ్మునిపై' అనుమాట కసికొద్ది వచ్చినది.

శా. పెంపేదం దమ కిట్టి తక్కువలు రూపింపంగ నేలా!
విచా,రింపన్ వారిక మేలు సంధి దము వారిం జూ
చినన్ దారు సా,ధింపం జాలరో కాక పోరఁ దగ
మర్దింపం దలంపేని శం,కింపం బట్టోళో! వారు బ్రా
హ్మణులె యేకీడైన స్సైరింపగన్.

ఉ. ఓట యొకింత యేనియు సుయోధను చిత్తమునందు
లేదు నీ, మాటలఁ బోవునే దురభిమానము మొక్క
డు ప్రాణుఁగాక యు,చ్చాటన సంగరంబులగు
చొప్పులు పుట్టినసైనఁ బాండవుల్, పోటున కిచ్చ
గింతురోళో! పోదురో! కానలనుండ నచ్యుతా!

'కానలనుండఁ బోదురో' అనుమాటలో ఎంత భావధ్వని గలదో
చూడుఁడు.

చ. అరయమిఁ జేసి కోడలన కప్పుడు దాసిగఁ జేసె న
మ్మహా,పురుషుని పాలికిం బతులు ప్రోవఁగ వీరల
తోన యేను జె,చ్చెరఁ జని కోటరంబు దగఁ జేయు
దునో! అటుగాక పాడిమై, పరవుడ మోపిచేయు
దునో! వారికి మాధవ! నిశ్చయింపుమా.

# భారతకవి యౌచితి.



పాండు నరపాలసుతులుపప్లావ్యమునకు
వచ్చియున్నారునీవేఁగి వాసుదేవ
సహితముగవారిఁగని తద్విషాదమేమి
భంగిమానునమ్మెయిఁదగఁ బలుకవలయు.

వెనుక ద్రుపదుపురోహితునితో "బిడ్డలపాలికిప్డుపుత్తెంచెద" ననునపుడు పాండవులను బిడ్డలని ప్రేమసూచనతోఁ బేర్కొనిన ధృతరాష్ట్రుఁడిపుడు తన యాంతరంగికుఁడగు సంజయునితోఁ జెప్పుచు "పాండునరపాలసుతులు" అనుట కపటిగాఁ జూపఁబడెడి ధృతరాష్ట్రుని పరశ్రేయస్సహిష్ణుత లేమి కెంతయుఁ దగియున్నది. వారివిషాదమును మాటలతోఁ బోగొట్టుమని పద్యముచివరఁ దేలుచున్నది. వారి దుఃఖముపోవుపద్ధతులన్నియునొప్పుకొనిరమ్ము. అట్లు నేను జరిపించెద. అని బాహ్యార్థము. "పాండునరపాల" అనునది భావధ్వని. "పలుకవలయు" అనునది వస్తుధ్వని.

"క్షీరోదకవృత్తి మనము, వారలునుంగలసి బ్రతుకవలవదె? నెమ్మిని వారిదుమలఁబడఁదగిమెదు, వారే? పితృభాగ మేలువారలుగారే? " ఇచ్చట సంజయునకుఁగూడఁ దన దురభిప్రాయము దెలియనీయకుండవలెనని గ్రుడ్డిఱేఁడు తలంచుచున్నాఁడు. ఇది పిచ్చి. సంజయునకుఁ దనమాటలలోని ధ్వనులు విదితములుకానిచో నడవఁగలదా? పని.

అర్జునుఁడు గాండీవము మోపెట్టి జగత్త్రయక్షోభము సేయఁడా? భీముఁడు కురుకుమారులపైఁగవియుట భావించినఁ గంపమడరు. రుద్రునకునైన నోర్వరాని ధర్మజుకోపమునకుఁ దలఁకవలదా? అనుమాటలు ధృతరాష్ట్రునిభీతిని మహారాజౌచిత్యమును గప్పిపుచ్చుచుఁ దెల్పుచున్నవి.

అతిభీతుఁడైన ధృతరాష్ట్రునకు యుద్ధమిష్టము కాదని యు రాజ్యలుబ్ధుఁడైన దుర్యోధనుఁడు పాలుపంపున కొడంబడ డనియుఁ దెలిసి సంజయుఁడు

"పాలీ: కౌరవులు దు
శ్శీలతఁ జెడఁదలఁచి రేని చెప్పెద రుధిరా
ఖిలాన్నముఁ కంఠెను గడు
మేలగు భిక్షాన్నమైన మీనడవడికిన్".

అని పాండవులను శాశ్వతవనవాసులుగఁ జేయుఁగలఁడనియేమో!

సంజయుఁడు ధృతరాష్ట్రుసందేశములోని "వాసుదేవ సహితముగ" ననుముఖ్యవచనమును మఱువలేదు. ముందుగఁ గృష్ణుఁడర్జునునితో వినోదముగ నున్నయింటికి వెళ్ళి నాఁడు.

ధర్మజుఁడు సంజయుని గుశలమడుగునపుడు శత్రుబలాబలనిర్ణయమును సులువుగఁ జేసికొనుచున్నాఁడు,

ద్రోణకృపాశ్వత్థామలు సుఖమున్నారా? అని ప్రథమప్రశ్నము వీరిని రాజు చక్కఁగాఁ జూచుకుంట పాండవులకు సగము బలము.

భీష్మునకుఁ గుశలమా? అను నది రెండవప్రశ్న. భీష్ముని యనుగ్రహము కౌరవులకాయుపట్టు. అది సడలె నేమో! అని ధర్మజుని యోజన. ఒత్తురువోద్ధులవలనఁబుట్టు చుండెనా? అనుట పొరుగురాజుల సాయముందునేమో అని తెలిసికొనుటకు? గాండీవి భుజబలంబు దలఁతురె? భీముగదా విహారముగ్గడింతురె? అనుట తమబలమును దృణీకరింపఁగల బలమువారికిఁగలదో అనియెఱుంగుటకు? కుశలప్రశ్నములు భావికార్యనిర్ధారణకుపయోగించుట ధ్వనికవితలక్షణము. నాటకములోనిపతాకాస్థానకమువంటిది.

సంజయునకడలుకల్గవలెనసియు వాఁడది కౌరవులకుఁ దెల్పవలయుననియు దానిచే వంశనాశము కాకుండ రాజ్యము రావలెననియుఁదలంచు ధర్మరాజు తమ్ముల బలపరాక్రమముల నుగ్గడించుచు ''వినుము మనము మధ్యస్థులమని యర్జునునెదిరి సంజయా! యిటమున్నెవ్వనికిని మానముఁ బ్రాణంబును దగఁదక్కించుకొనఁగఁబోలునె? చెపుమా! అని యర్జును శౌర్యమును బ్రస్తుతించుచుండెను. అప్పుడు యుధిష్ఠిరుని స్మృతికిరాఁదగ్గ విషయమెయ్యది? పాండవులకుఁ గన్నుఁదాకు పుడకగాఁ గౌరవులలోనుండువ్యక్తి. అట్టివ్యక్తి కర్ణుఁడే. భీష్మద్రోణాదులు బలవంతులయ్యును బాండవపక్షపాతులు. వారివలనఁ బాండవులకు భీతి లేదు నిష్కపటముగ దుర్యో ధనునికార్యమునకై ప్రాణముల ధారపోయఁదలఁచి యున్న

భారతకవియాచితి.

వాడును పార్థుని ప్రతిజ్ఞ కేవగించువాడును సూర్యసూనుడే ఇది ధర్మజుని హృదయములోజొచ్చి చూడనికవి ప్రతిభకెట్లు గోచరమగు?

చూడుడు.

దుర్యోధనునింటందగు
కార్యమునకు ఖడ్గమునకుఁ గలవాఁడై చా
తుర్యంబు మెఱయుకర్ణుని
యార్యత్వము చెల్లుచున్నయదియే నెమ్మిన్.

అని కర్ణుని పెత్తనము గుప్పున యుధిష్ఠిరునిస్మృతికి వచ్చినది. ఆతని పెద్దతనమున నసూయయుఁ బలుముఖముల వెల్లడి యగుచున్నది.

సంజయుని కార్యవాక్యములలో మొదటిది

" పొందొందఁగఁ దలఁచితి నీవు "

అనునది. ఇది సంజయుఁ డెప్పుడు ధర్మజునినోటవినెను? వినలేదు. ఊరక మొత్తువేయుచున్నాఁడు. స్తోత్రములతో మరల నడవులకుఁ బాండవులనంపవలె ననుకొనిన గుడ్డిరాజు మొదటి పాచిక యిది.

పూర్వమరణ్యప్రయాణము ననుమతించిన పెదతండ్రి సలహా యిపుడుమాత్ర మెట్లు గ్రాహ్యము సందియమును " వృద్ధతకతమునఁ జిత్తమొకవిధము గామి నప్పుడు నుతోద్ధతి మానవడ " అని పాడుచున్నాఁడు.

దయాపయోనిధీ! జనక్షయకరమును జయాపజయములు తెలియరానిదియునగు యుద్ధమును నీవంటి వారొప్పరని యుద్ధము నిరాకరించెను.

నీకుఁ దమ్ముల బలము కలదు. నిన్ను వేల్పులుం జెనక లేరు. అని స్తుతించి, ,,బల్లవుకాక చివ్వకుఁ,, అనెనుఁ ఈముఖస్తుతులే పాండవుల నడవులకు మరల నంపకాలు సేయునని ధృతరాష్ట్రుఁడు తలఁచె.

,,పొందొందగ,, —,,బల్లవుగాక,, —అని సంజయుఁడు వేసిన రెండెత్తులకు యుధిష్ఠిరుఁడు పైయెత్తు వేయుచున్నాఁడు.

,, పోరితంబులే కయ్యెడు నర్థసిద్ధి
వెడగైనను నొల్లక యొఁడు సేయునె? ,,

ఇంకొకగొప్ప యెత్తు—,,ఎదిరింపనుయట్టులకా,,—మాకుంగుడుమిండి పై మీరు ప్రక్కగొనుఁడు. ! అనినఁ గుదురునా సంధి? అనుచున్నాఁడు. చక్క నగమీయవలెఁ గాని కొన్నియూళ్లిచ్చిన సంధికుదురదని సూచన. ఐదూళ్లిచ్చినఁ జాలుననఁబోవు ధర్మజుఁడిపుడిట్లనుట చావునకుఁ బెట్టినంగాని లంఖనాలకు దిగదని కాఁబోలు!

మనమమ్మఁ బొగడి పదపడి
యనివారలఁ గెలువ నరిదియని పొత్తుగఁ జె
ప్పినమాటకు నేనొడఁబడ
విను సంజయ! పక్షపాతవృత్తి విడువుమీ

" పెట్టనికోట " ... ... ...

" ద్రోణుఁడు " ... ... ...

అను నీపద్యములలో సంజయుఁడు చెప్పినదానికి " యేనుమహాత్మ " అనునది పూర్వపక్షముగాఁ దోఁచు. ఇట్లే సంజయుని చేతఁ గొన్ని చెప్పించి వానినెల్ల ధ్వనిగను వాచ్యముగను సక్రమముగ ఖండించు ధర్మజుమాటలు తదేకదృష్టితోఁ జూచ్చుట కవియాచిత్యవిజ్ఞానమునే తెలిపెసి.

ఇఁక ధర్మజసంజయుల మాటలు పూర్తిగాఁ చెఁబోవుచున్నవి. శ్రీకృష్ణునిచే సిద్ధాంతమును జెప్పింపవలెను. కాన సంజయునిచే సారభూతమైన మాటను జెప్పించుచున్నాఁడు కవి.

అది

"పాలీక కౌరవులు"

అనునదియే.

ఇది యతికఠోరమగు పల్కని తెలిసికొనియే కాఁబోలు సంజయుఁడు వెంటనే బట్టుపొగడినట్లు ధర్మజుని యహింసను బొగడినాఁడు.

ఆల్పులకుమిగ్రింగఁ జేదైన హాలహాలము
భంగిఁ బొంగెడి కోపంబు మిగ్రింగికొనఁగ
నీలగళునెన్ని యెన్నంగఁ బోలునట్టి
నీవుసాలినఁ గాకేలనెగడుఁ బేరు?

అని కైవారముచేసి వదలెను

యుధిష్ఠిరుఁ డీకైవారాలను లొంగువాఁడు కాఁడు. అహింస మంచిది కాన కౌరవులకు రాజ్యము వదలి నీవడవికిఁ బొమ్మనునదిధర్మము కాదని ధర్మరాజునిరూపించుచున్నాఁడు.

అహింసయుత్తమధర్మము. అట్లైనను వంశదూషకులును లోకకంటకులునగు పాపాత్ములనిర్మూలనంబు సేయుట ధర్మంబని పెద్దలచేతవిందుము. ఇది ధర్మజుని సిద్ధాంతము. ధర్మము, పెద్దలుజ్ఞానదృష్టితోఁ బూర్ణముగ విచారించినంగాని తేలదనియు స్వల్పులు ధర్మము నధర్మ మనుకొనుటయు నధర్మమును ధర్మమనుకొనుటయుఁ గలదనియు లోకులకెల్లఁ బ్రతిపదమందును గావలసిన ధర్మనిర్ణయ ప్రకారము నెట్లు బోధించుచున్నాఁడో చూడుఁడు.

"ధర్మములట్లయుండి బోధను లరయుంగవచ్చిన నధర్మము
లై చెడుఁ గొన్ని ధర్మవర్తనములు గాకతోఁచి తుది ధర్మ
ములై చనుఁ గొన్నికర్మముల్"

ధర్మస్వరూపము పెద్దలచేఁ దెలిసికోవలెనని ధర్మరాజు నిశ్చితి.

ధర్మజ సంజయుల వాదము పూర్తిగాంచిన పిదప శ్రీకృష్ణుని తీర్మానము,

"పాడితోడి యార్జనంబునం దమకుఁ గల్గిన కలిమి ననుభవించుచు సత్పథంబున నడచుచుండఁ దమ్మొరులన్యాయంబు చేసినప్పటికిఁ గదా శస్త్రాస్త్రధర్మంబు లింద్రాదులగు పెద్దలు గావించిరి."

"రాజు లిచ్చువారు కాని వేడుకొనువారు కారు. సర్వ వర్ణాశ్రమ ధర్మపాలన మొనర్చు రాజులు నిజధర్మంబువదలు దురెని ,,

" కం॥ విను మవమానము పడి యి
ట్లునికిఁ బడయు పొగడు కంటె నుజ్జ్వలు లై
మానొర్కొనిన నదిలెస్స. యెట్లై
నను వీరికిఁ బోరుమేలు నాకుం జూడన్ ,,

శ్రీకృష్ణుని గీతాసిద్ధాంతము కూడ నిట్టిదియ.

దుర్మార్గులను జంపుపట్టున దయకల్గెనేని శరీరమే నశించెడిది కాని యాత్మనశింప దనుకొని దయను మూలకుఁద్రోయుఁ డనియు ఫలము మాటఁ జూడక శిష్టరక్షణదుష్టశిక్షణములను శూరులు సేయుచుండవలయు ననియు సంతతము పరమాత్మధ్యానమున భేదము నంటనీక కామదూరుఁడై ముక్తుఁడు కావుట జనునకుఁ గావలసిన దనియు గీతాభావము వెలయుఁగదా.

—◆సంజయురాయబారములోని నుడికారముల సొగసు.◆—

1. అర్జునుఁడు గాండీవంబు మోపెట్టి కృష్ణుని సారథ్యము నైజగత్త్రితయ సంక్షోభంబుఁ గావింపఁడే ?

2. ఒడ్డోలగంబున్నసమయంబున.

3. పెట్టనికోట. ఒట్టినమంటలు. చుట్టుపుమేర

4. మాకుంగుడుమిండిదెమీరాయ వ్రక్కగొనుఁడని చదురడ

చీన మనసుపొందు చక్కంబడునే?

5. ఇంతలు సేసిన యట్టివారి నేల . గర్వంబు సెల్లంగ నిచ్చి జగము చేతఁదిట్టులు పడునట్లు సేసిపోయితి?

ఏలఁ యడవుల నిమ్మోయి నిడుమగుడిచి తేల తాల్మి యధనముగాఁ నింతపడితి.

కం. తుదిఁబోయి క్రూరకర్మా, స్పదముగు
తెలుఁగునఁ దొడఁగి బంధులగురులఁ
వెదకి వధియించు సౌఖ్యంబది యేటికి?

6. నీలగళు నెన్ని మెన్నంగఁబోలునట్టి నీవు.

7. పాండవాగ్రజన్మపలుకుల చందంబుచూడ సంధిలేని
చొప్పతోఁచె. ఇది కార్యవాదము.

8. కొఱతనుఱుకులై.

9. రసోచితవర్ణగుంభన—గాండీవజ్యారవంబుత్కటముయి
వెలుచంద్రగిమ్మినఁ ...

10. నెట్టనసభలో నేవురకట్టెదుర నరాతితనముగాఁ గెంతయుఁ
దారెట్టితులువలోద్రోవదినట్టుపఱిచిరి

11. తిట్టులఁబోయి

12. దుశ్శాసనుండు చెప్పినట్లు వీరలు గొడ్డుపోయిరి కాక వీరలదెస వారికి నేమిఫలించె?

మెంతటిపోటుమాటలో చూడుఁడు.

13. పోయిన మొగమున

14. సంజయుఁదిక్కు మొగంబై

15. బలమత్తాకృతియైనభీముఁడను శుంభత్కుంభిసంరంభ
ముఁన్ నిలిపెన్ నాఁడును సంకుశంబయింతుదిన్ నేడున్
దదుద్రేకముఁన్ మఁలఁగఁజేయు నజాతశత్రునికృపామా
ర్గ్యంబుచాలంగ వారలకేలా నయవిక్రిమోచితవిచా
రక్లేశముల్ మాధవా! ఇందర్జునుని భావములచొప్పిత్తి
నట్లగపడెడిని.

---

# మీఁగడతఁకలు.



## బమ్మెర పోతరాజుగారి కవిదృష్టి.

ప్రహ్లాదుని చరితమును వ్యాసులవారు ఉపనిషత్సిద్ధాం
తమును వెల్లడించుటకు సాధనముఁగాఁ దీసికొని భక్తిజ్ఞాన
వైరాగ్యములకుఁ దార్కాణచేసెను. పోతరాజుగారు ప్రహ్లా
దుని వ్యాసునిమాటలతోనే కాక స్వతంత్రించి సైతము
కొంత వర్ణించి యొకమహాసాత్త్వికవ్యక్తియొక్క ప్రతికృతిని
జిత్రించి చూపెను.

ఇది మనవాఙ్మయముం దెల్లెడలఁ గల యంశమే.
ఏ గ్రంథకర్త సత్త్వగుణమున కగ్రస్థాన మిచ్చి యుండలేదు?
ఏకవిసాత్త్వికులైన మహాపురుషులకే పర్యవసానమున జయ
మును సమర్థించియుండలేదు ఏ పుస్తకమున సాత్త్వికుల నిష్ఠా

విశేషమును జూపుటకే రాజసతామసుప్రచరితము లప్రధానముగఁ బ్రతినాయకవృత్తములలోఁ జేర్చియో, ప్రాసంగికకథలుగఁ గూర్చియో చూపఁబడలేదు?

పోతరాజుగారు ప్రహ్లాదుని మహిమను కొలఁదిపిడి ప్రాయిగఁ దీసికొనఁబడినదైనను హిరణ్యకశిపుపాత్రముయొక్క స్వభావవిశేషముల నచ్చొత్తి చూపుచు, రాజసతామసప్రకృతుల స్వరూపకథనమునకుఁ జాలప్రాధాన్యతనిచ్చి, కవికుండవలసిన లోకజ్ఞతను వెల్లడించియున్నాఁడు. రాజసులలో మొదటిస్థానము నధిష్ఠించియుండెడి హిరణ్యకశిపునివంటి బలశాలికి సమర్థునకు లోకికునకుఁ బరమవిరక్తుఁడైన కొడుకు దాపురమైనపు డాతనిచేత మేతీరున నుండునో, ఎట్టివిచారమాతని కుద్భవించునో, అతఁడు ఏమిభాషించునో, ఏమిచేయునో. అన్నియుఁ బూస గ్రుచ్చినట్లు పోతన చెప్పఁబూనినాఁడు. చూడుఁడు.

శా. లభ్యంబైన సురాధిరాజపదమున్
లక్షింపఁ డశ్రాంతమున్
సభ్యత్వంబున నున్నవాఁ డబలుఁడై
జాడ్యంబుతో వీఁడు వి
ద్యాభ్యాసంబునఁ గాని తీవ్రమతి గాఁ
డంచున్ విచారించి దై
త్యేభ్యుం డొక్క దినంబునన్ బ్రియునుతున్
వీక్షించి సోత్కంఠుఁడై

తాను సమర్థుఁడై స్వార్థపరుఁడై కార్యశూరుఁడై కావల

నంత ఆస్తి సంపాదించినాఁడు. ఇంతవాఁడు లేఁడనిపించు
కొనినాఁడు. ఒకరికి లొంగక ప్రవర్తించినాఁడు. కొడుకు
గూడ తనంతవాఁడు కావలెనని ఆశ. ఉపన్యాసవేదికలపై
కెక్కినపు డేదియు శాశ్వతము కాదని యుపన్యాసము లిచ్చు
చునే యున్నాఁడు. కాని తనకొడుకు హరినామస్మరణము
చేసికొనుచుఁ బ్రయోజకుఁ డనిపించుకొననప్పుడు, బైరాగి
వేషముగా నున్నప్పుడు, బలపరాక్రమాదులు గలిగి నిగ్ర
హానుగ్రహసమర్థుఁడై లోకమును గడగడ లాడింప నపుడు,
ఆతని సభ్యత్వము సాధుత్వము మొదలైనవి తండ్రికాత్మలో
రుచించునా? కొన్నివేలు సంపాదించుకొని వృత్తి సన్యాసము
చేసియున్న పెద్దమనుష్యులకు మాత్రము తమ
కొడుకు బియల్ పరీక్షలో నుత్తీర్ణుఁడై వెంటనే పాపభీతిచే
న్యాయవాదిపదము నంగీకరింపకున్న సాధారణముగ సమ్మత
మగునా?

ప్రహ్లాదుని సభ్యత్వము జ్ఞానమువలనఁ గలిగినదికాని
దౌర్బల్యముచేఁ గలిగినది కాదు. కాని తండ్రికదియిష్టముకాదు
కావున దుర్బలతచేఁ గలిగినదని నెపము వెట్టిగర్హించుచున్నాఁ
డు. జ్ఞానముచేఁ బ్రపంచము ననిత్యముగఁ దెలిసికొని

'విశ్వమందుఁ గన్న విన్న యర్థము లందు
వస్తుదృష్టిఁ జేసి వాంఛ యిడఁడు'

అని తాను స్వయముగఁ దెలిసికొనియు నద్దానిని గర్హించినఁ
దాను బహిరంగసభలలో ధర్మపన్నాలు ఏకరువ్వ వేయుటకు
వీలుండదుకదా.

# కావ్యనాటకాదిపరిశీలనము.

'అంధప్రక్రియ నున్నవాఁడు పలుకం
డన్నత్రపతాపక్రియా
గంధం బించుక లేదు మీరు గురువుల్
కారుణ్యచిత్తుల్ మనో
బంధుల్ మాన్యులు మాకుఁ బెద్దలు మముం
బాటించి యీబాలకుఁ
గ్రంథంబుల్ చదివించి నీతికుశలుం
గాఁ జేసి రక్షింపరే.'

తన పశ్చాత్తాపము దవానలమై సకల భువనములమాఁడ్చి వేసినది. సమర్థుఁడైన తనదౌర్జన్యముచేత దేవేంద్రునంతవాఁడు తన ప్రమోల నొదల నెత్తలేకున్నాఁడు. తన్ను మించినవాఁడు తనకొడుకు కావలెనని యువ్విళ్ళూరుచున్నాఁడు. 'సర్వత్ర జయ మన్విచ్ఛేత్ పుత్రాదిచ్ఛేత్పరాజయమ్!' కొడుకుదారి వేరైనది. ఆసాధుమార్గము తాను చదివిన వేదశాస్త్రాదులలో నెల్లచోట్ల కైవారము సేయఁబడునదియైనను, తాను పరులకు ధర్మోపన్యాసములు చెప్పునపుడు మాటిమాటికి నోట వచ్చుచుండునదియైనను ఆత్మకు నచ్చినది కాదు.

అంతఃకరణములన్నియు నొక్కరీతి నుండవు. సాత్త్వికాంతఃకరణమునకు సాధుమార్గము రుచించును. రాజసబుద్ధికి సమానస్కంధులలో గొప్పకావలసినది. 'సమానానాముత్తమశ్లోకో అస్తు,' అని శ్రుతిరాజసవాంఛ ననువదించెడి. తామసులకు నిద్ర సోమరితనము మున్నగునవి నచ్చియుండును. కాని పున్నకాలమాటల కలవాటుపడి యందఱును బహిరంగ

ప్రసంగములలో వాసికోనము ధర్మ్యమైనసాధుమార్గము నే శ్లాఘించుచుండురు. అంతఃకరణములోని మాలిన్యము కార్య కాలమున వెల్లడియగును ఎన్నోతిప్పలు పడినంగాని ప్రకృతి మాఱదు. హిరణ్యకశిపుఁడు తానను కొనుచున్న ప్రహ్లాదుని జాడ్యము రాజనీతిగ్రంథములు చదువుటచేఁబోవునని యెం చెను. అవును. ఆగ్రంథములలో శత్రుమిత్రత్వములు నిగ్ర హానుగ్రహములు పురుషార్థములుగాఁ జెప్పఁబడును. ఆసం స్కారము మనమున నంటుకొని బాలుని శీలము మాఱుట రాక్షసరా జుద్దేశించినది.

పాఠశాలచదువు నారదమహర్షి యనుగ్రహించిన పర విద్యాపరిపాకమునఁ గృతార్థుడై యుండిన ప్రహ్లాదునిమార్పఁ గలిగినది కాదు. అంతకంతకు నారదోపదేశము తల కెక్కి పోయినది. శ్రుతి మించి రాగానఁ బడినది. విష్ణుచింతలో నుతుఁడు మునిఁగి తేలుచుండుట తండ్రికిఁ బ్రత్యక్షమైనది. ఆశ్చర్యము గల్గినది. వాత్సల్యము విడఁజాలకున్నాఁడు.

"నాకుం జూడఁగఁ జోద్యమయ్యెడిఁ గదా
నాతండ్రి! యీబుద్ధి దా
నీకున్ లోపలఁ దోఁచెనో! పరులు దు
ర్నీతుల్ పఠింపించిరో
ఏకాంతంబున భార్గవుల్ పలికిరో"

అనిచున్నాఁడు. 'నాతండ్రి!' అనుపదము శోకఝురముతోఁ గలసి ఘూర్ణిల్లు వాత్సల్యప్రవాహమును వెల్లివిరియించుచు

న్నది. వాత్సల్యప్రతిబంధముచేఁ గొడుకు ననలేక పరుల మీఁదికిఁ బోవుచున్నాఁడు.

'కొఱగాని కొడుకు పుట్టినఁ
గొఱగామియె కాదు తండ్రి గుణములు చెఱుచున్.'

కడుపుతీపిచే సజ్జనులుకూడ దుష్టులగు సుతులలోఁ గలసి పోవుదురు. ఇక్కడ నసాధువగు తండ్రి సాధువగుకొడుకుతో నేకీభవింపఁ బ్రేరణసేయు పుత్రస్నేహము నాఁగికొనలేక అయ్యనిష్టమునకుఁ దనకుఁ దనచుట్టుగల శత్రుమండలమే కారణమేమో! అని యనుమానపడుట సహజముగనున్నది. అత్యంత విశ్వాసార్హులైన కులగురువులమీఁదఁగూడ సంశయము గల్గినది. ఆహా! దారేషణా పుత్రేషణా ధనేషణ లెంతకు లేవు?

చివరకు వాత్సల్యవశుఁడై బతిమాలుకొనుచున్నాఁడు.

'ఈ దానవ శ్రేణికిఁ
వైరుఁడుగాఁడు కృతాపరాధుఁ
డతనిఁ వర్జింప నీకేటికిఁ.'

దేహాభిమానము గలవారికి జాతిపై నభిమానముండును. ప్రహ్లాదుఁడు దేహత్రయాతీతుఁడై యున్నాఁడు. ఆయనకు దానవజాతికి విరోధి యనినంత విష్ణువుపై భక్తిపోలేదు.

'సురలం దోలుటయో సురాధిపతులన్
నుక్కించుటో సిద్ధులన్
బరివేధించుటయో మునిప్రవరులన్
బాధించుటో యుక్తికి

# బమ్మెర పోతరాజుగారి కవిదృష్టి.

స్వరగంధర్వవిహంగనాగపతులన్
నాశంబు నందించుటో
హరి యాచున్ గిరి యంచు నేల చెడ మో
హాంధుండవై పుత్రకా!'

ఇట్టిదౌర్జన్యము నెట్లుపదేశించెనా అని మన కచ్చెరువు
గల్గుచున్నది. కాని యీప్రకృతియే లోకమున విశేషముగ
ప్రచారముకలది.

జాతీయకళాశాలలు వేదశాస్త్రపాఠశాలలు మున్నగు
వానిని స్థాపించి పెక్కురు విద్యార్థులకు అన్నపానము లొసఁగి
యు విద్యార్థివేతనము లొసఁగియుఁ బండితసత్కారము
లొనర్చుచుండియుఁ బూర్వవిద్యల నెల్లఁ బునఃప్రతిష్ఠ చేయువల
యునని భగీరథప్రయత్నము లొనర్చు దేశోద్ధరణబద్ధకంకణు
లగు సంపన్నులు తమసుతుల నింగిలీషు కాలేజీలనుండి యేల
తీసికొనిరారని చాలకాలము న్యాయవాద వృత్తిలో మెలఁగి,
కొంచెముగనో గొప్పగనో అసత్యోక్తి సంబంధములేక యా
వృత్తినడపదని త్రికరణశుద్ధిగా నెఱింగిన ముదునలి న్యాయ
వాదులు బిఏ ప్యాసైవచ్చిన తమపుత్రులను లాకాలేజీల
కేల పంపుచున్నారని

ఎల్లరకును బాపభీతికన్నఁ బదుగురిలో గొప్పగఁ దాము
ను దమవాండ్రును గాలక్షేపము సేయవలెనను కోరిక మెండు.
ఈపామరత్వము జ్ఞానబలము వలనఁగాని రూపు మాయునది

కాదు. అది రాజసప్రకృతికలభ్యము. కాని యెంతటిరాజసుఁ డైనను బహిరంగముగ నిట్టిమాటలను నోటరానీయఁడు. వాసి పోవునని భయము. హృద్గుహాలలోపల గూఢములై యిట్టి యాశయము లుండి యేకాంతప్రసంగములలో వెలువడుచుం డును. వీనిని పోతన కనిపెట్టినాఁడు. రవి కాననిచోఁ గవికాన కుండునే? అనుటయిదియే. ఇదియే కవిదృష్టి.యని నేను చెప్పఁ దలచుకొనినది. ఈరీతి హిరణ్యకశిపునింకను బలుకల్పనలతోఁ బ్రదర్శించినవాఁడు పోతరాజుగారు. వ్యాసులవారు కారు. కావున సహజపాండిత్యవిలాసమైన యిట్టి కవితాస్వాతంత్ర్యము పలుచోట్ల బోతన నుడికారములఁ గన్పట్టు.





శ్రీ చింతామణీ ముద్రాక్షరశాల రాజమండ్రి—1931

# తప్పొప్పులపట్టిక.



| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧ | ౧౫ | వాక్యా | కావ్యా |
| ౫ | ౧ | విచార | విచారణా |
| ౭ | ౪ | జీత్రి | జిత్రి |
| ౮ | ౧౮ | కుంబలె | కుబలె |
| ౨౦ | ౧౬ | యూచ్చత్య | యూచిత్య |
| ౨౪ | ౧౧ | సేర్పిస | సేర్పివ |
| ౩౦ | ౧౪ | లద | దల |
| ౩౧ | ౫ | చిడిపి | చిడిపి |
| | ౬ | రహాణ | రగహాణ |
| | ౧౫ | నన | [illegible] |
| ౩౪ | ౧౯ | నైమి | నైసమి |
| ౩౬ | ౬ | సీకా | సీకా |
| ౩౯ | ౧౧ | నిర్వృతి | నిర్వృతి |
| " | ౧౩ | పాత్రి | ప్రాంత |
| ౪౨ | ౮ | బ్రాద్ధిం | బ్రాథ్ధిం |
| ౪౭ | ౧౩ | జయము | జయాగమనము |
| ౫౦ | ౭ | వాఖ్య | వ్యాఖ్య |
| " | ౧౩ | ఖ్య | ఖ్య |

| | | | |
|---|---|---|---|
| ౫౧ | ౧౭ | దిజ్మ | ధిజ్ఞా |
| ౫౨ | ౧౩ | మాతు | మాతుగ" |
| ౫౨ | ౧౪ | నీ"అను | అను |
| ౫౩ | ౧౪ | వ్వవహా | వ్యవహా |
| ౫౪ | ౨౧ | ఇత్యారు | ఇత్యాదు |
| ౫౫ | ౨౨ | యర్న | యత్న |
| ౫౬ | ౧౫ | మన్మథకాదంబ | కాదంబ |
| ౨ | ౧౬ | పుండరీ | మన్మథ పు |
| ౫౭ | ౧౨ | మగి | మంగి |
| ౬౩ | ౭ | మ ఋ ౯న్న | మయియున్న |
| ౬౫ | ౧౨ | వ్టైన | వ్టైన |
| ౬౬ | ౭ | సంతగమ | సంతగను |
| " | ౧౭ | నాగరక | నాగరిక |
| ౭౦ | ౨౦ | బ్రావథ | బ్రావీథ |
| ౭౧ | ౧౯ | రాచరిక | రాచఱిక |
| ౭౨ | ౧౧ | త్స్వజన | త్స్వజన |
| ౭౩ | ౨౦ | వస్తువులును. | వస్తువులును |
| ౭౪ | ౯ | శ్లోమం | శ్లోకమం |
| " | ౧౪ | దునా | చునా |
| " | " | గొప్పను. | గొప్పను |
| ౭౫ | ౯ | తా౨పి | తా౭పి |
| " | ౨౦ | శ్లో౨ | శ్లో౭ |

| | | | |
|---|---|---|---|
| ౭౬ | ౭ | సఖులుర | సఖులుతో |
| ,, | ౧౪ | మహా | హా |
| ౭౭ | ౩ | కలరుహై | కరరుహై |
| ౭౮ | ౬ | నిర్భంధ | నిర్బంధ |
| ౭౮ | ౧౩ | దర్భ | దర్ప |
| ,, | ౧౭ | దాసు | దాస |
| ౮౧ | ౧౫ | నిట్టివే | లిట్టివే |
| ,, | ౧౭ | యమును | మును |
| ౮౪ | ౧ | పతిపద్య | ప్రతిపద్య |
| ౮౫ | ౬ | మాన | మాస |
| ,, | ౧౫ | ఖోటియ్యై | ఖోటియై |
| ౮౬ | ౪ | జనామి | జానాము |
| ,, | ౫ | రావణ్య | లావణ్య |
| ౮౭ | ౧౨ | కన్పట్టెదు | కన్పట్టెడు |
| ౮౮ | ౬ | లెదెరు | లెదురు |
| ,, | ౮ | ఇంద్రా | ఇందా |
| ,, | ౯ | నందపా | నందనపా |
| ౮౯ | ౨౧ | యాగ | యోగ |
| ,, | ,, | మాస | మావ |
| ౯౦ | ౧ | నభ్రాంతి | సభ్రాంతి |
| ,, | ౪ | డయై | డయ్యై |
| ౯౧ | ౧౧ | క్రించు | కింద్రు |

| | | | |
|---|---|---|---|
| ,, | ౧౭ | యని | వని |
| ౯౨ | ౪ | సనురాగబు | సనురాగం |
| ,, | ౭ | వ్రాత్రైస్త్రీ | వ్రాత్రైస్త్రీ |
| ,, | ౧౩ | పాస్తై | పాస్త్రి |
| ౯౩ | ౧౧ | హాగ్షిల్ప | హాగ్షకల్ప |
| ,, | ౧౨ | నాందరి | నాంధరి |
| ,, | ౧౪ | మస్తై | హస్త్ర |
| ,, | ౧౫ | ఘటించి | ఘటించి |
| ,, | ౨౧ | వృష్టిః | వృష్టిం |
| ౯౪ | ౧౦ | వ్రభేయక్ష | ప్రభేయం |
| ,, | ౨౧ | యాందరి | యాంధరి |
| ౯౫ | ౬ | బైమీా | భైమీా |
| ,, | ౧౦ | వివాహ | విబాహ |
| ,, | ౧౯ | మందలి | మందని |
| ౯౬ | ౧౨ | నుబాధిం | మునుబాధిం |
| ,, | ౧౪ | ప్రబలమైనన్న | ప్రబలమైయు: |
| ,, | ౧౬ | నౌచిత | నౌచితి |
| ,, | ౧౯ | ఘూంతుకమ్రై | ఘూంతుకమై |
| ,, | ౨౨ | ఆనంతు | ఆగంతు |
| ౯౯ | ౭ | ముక్య | ముఖ్య |

| | | | |
|---|---|---|---|
| ,, | ౧౪ | మద్దియు | మద్దియ |
| ,, | ౧౫ | రవ్విభుఁ | రవ్విభుఁ |
| ,, | ౧౭ | లబ్ధు | లబ్ధు |
| ౧౦౦ | ౧ | దీసివేని | దీసివేసి |
| ,, | ౭ | గూర్చి | మార్చి |
| ౧౦౧ | ౪ | శుళ్లు | నుళ్లు |
| ,, | ౭ | కావ్యసకా | కావ్యనా |
| ౧౦౧ | ౧౫ | నివిచ్ఛి | సవిచ్ఛి |
| ,, | ౧౬ | సంస్కృ | సంస్కృ |
| ౧౦౨ | ౯ | వ్రజ్ఞ | వ్రజ్ఞ |
| ,, | ౧౦ | సృజించి | సృజించు |
| ,, | ౧౭ | దానికిసంత | దానికివంత |
| ౧౦౩ | ౬ | అపూబూ | అపూ |
| ,, | ౧౫ | సామ్నాలనుయెట్లు | సామ్నాలనుఎట్లు |
| ౧౦౪ | ౯ | అనఁగా | ప్రరోచనయనఁగా |
| ,, | ౧౪ | సనునవి | లనునవి |
| ,, | ౧౭ | నిచ్చుటలో | నిచ్చుటతో |
| ౧౦౫ | ౫ | శఁరము | శఁము |
| ౧౦౬ | ౧౫ | రాయత్న | రాయణయత్న |
| ,, | ౧౮ | బ్రితియం | బ్రత్యం |

| | | | |
|---|---|---|---|
| ౧౦౭ | ౩ | గిరి | గిఱి |
| ,, | ౮ | రకములు | రకముల |
| ౧౦౯ | ౨ | మనవియు | మనవన్నిఁ |
| ,, | ౫ | గ్రంథ | గ్రన్థ |
| ,, | ౯ | చ్చోడిగ | చ్చోడింగ |
| ,, | ౧౪ | మనఁగా | మనఁగా |
| ౧౧౦ | ౪ | భాషిం | భాసిం |
| ,, | ౧౨ | నప్పుడు | నప్పుడు |
| ,, | ,, | లయోజన | లప్రయోజ |
| ,, | ౨౨ | గారము | గారమున |
| ౧౧౧ | ౬ | పరిసీల | పరిశీల |
| ,, | ౯ | యాస్తాన | యాస్థాన |
| ,, | ౧౦ | దఃబ్దశ | మర్దశ |
| ౧౧౨ | ౩ | జెప్పింపు | జెప్పంపు |
| ,, | ౮ | దమ్ములక | దమ్ములక్ |
| ,, | ౯ | పట్డ | పడ్డ |
| ,, | ౧౩ | భాండవుల్ | బాండవుల్ |
| ,, | ౧౮ | మోసి | మోపి |
| ,, | ,, | నిర్ష | నిర్ణ |

| | | | |
|---|---|---|---|
| ,, | ౧౯ | యుద్ద | యుద్ధ |
| ౧౪ | ౭ | బడినవిఁ | బడినవి. |
| ౧౬ | ౧౫ | గాలానిని | గాలాని |
| ౧౭ | ౫ | భావ్యి | భావి |
| ౧౮ | ౩ | వన్న | సన్న |
| ౨౧ | ౧౯ | సహిం | సహ్యం |
| ౨౨ | ౪ | యతులును, | యతుల |
| ,, | ౮ | గుప్పా | గుప్పా. |
| ,, | ౧౦ | క్రియలను | క్రియలును |
| ,, | ౧౫ | చెపి | చెప్పి |
| ,, | ౧౯ | చేయఁబడెను | చేసెను |
| ౨౩ | ౧౫ | పదు | వందు |
| ౨౪ | ౩ | వస్తు | వస్తు |
| ,, | ౮ | దర్శిఁకు | దర్శకు |
| ౨౬ | ౧౧ | సుద్యార్థ | విద్యార్థ |
| ౨౭ | ౧౭ | నేర్పబ | నేర్పఁబ |
| ౨౮ | ౫ | సంస్కృ | సంస్కృ |
| ,, | ౧౧ | సంస్కృ | సంస్కృ |
| ౨౯ | ౩ | ప్రాయిభా | ప్రాయిశ్భా |
| ౩౧ | ౧౪ | దంత్యాంత | దంత్యాత |

| | | | |
|---|---|---|---|
| ,,, | ౧౫ | ఇఈఎఏ | ఎఏ |
| ,,, | ౧౬ | కనెను | లనెను |
| ,,, | ౧౯ | నవర | నవర |
| ౧౩౨ | ౫ | చెలువు | చెయువు |
| ,,, | ౬ | గ్లై | గ్లై. |
| ,,, | ,, | యుచ్చులని | యుచ్చుల |
| ,,, | ౧౪ | "వచ్చును | యెతఁడు |
| ౧౩౩ | ౧౬ | కలపేక్షి | కపేక్షి |
| ,,, | ,, | చునాన్ను | కోవచ్చు |
| ౧౩౫ | ౧౫ | గొప్ప | గొప్ప |
| ౧౩౮ | ౧ | వ్యాకరణ | వ్యాకరణవ |
| ౧౩౯ | ౮ | ద్వృతరా | ధృతరా |
| ౧౪౦ | ౯ | కాఁగులు | కాఁఉలు |
| ౧౪౫ | ౯ | పలీకా | పలీకకా |
| | ౧ | భిలాన్న | భీలాన్న |
| ౧౪౮ | ౫ | అనెను. | అనెను. |
| ౧౪౯ | ౧౨ | ఆల్ప | అల్ప |
| ౧౫౦ | ౪ | ధర్మబు | ధర్మంబ |
| ౧౫౧ | ౫ | వై | లై |

